

# ప్రతాపాగ్బరీయము.

ఇది

బళ్ళారిలో వకీలుగానుండి

కీ. శే. బ్రహ్మశ్రీ॥ కోలాచలం శ్రీనివాసరావుచే

రచియింపఁబడిన చరిత్రనాటకము.

కె. శత్రుఘ్నరావుచేఁ

ప్రకటింపఁబడెను.

మొదటికూర్పు.



బళ్ళారి.

ఆంధ్రాముద్రాక్షరశాలయందు

ముద్రితము.

1925.



వెల రు. 1—0—0

## నాటకమునందలి పాత్రలు.

### పురుష పాత్రలు.

| | |
|---|---|
| అక్బరు | జగ్ మల్లు |
| బైరాము | విక్రమసింగు |
| పీరుమహమ్మదు | ఉమ్రా |
| ఖాన్ ఖాన్ | లక్ష్మణభట్టు |
| రాజామాన్ | కుబేరసేన్ |
| హైమాము | జయదేవ |
| అబ్దుల్ ఫజుల్ | భీమజి |
| మల్లాదేవ | శేషజి |
| బలవంతదాసు | కృష్ణసింగు |
| ఉదయసింగు | దౌలతుసింగు |
| రవివర్మ | సర్దార్ సింగు |
| సూర్యసింగు | బలవత్ సింగు |
| భాస్కరసేన్ | రైమల్లు |
| ప్రభాకరరావు | పృథ్వీరాజ్ |
| రామసింగు | బీరుమల్లు |
| లక్ష్మణసింగు | సలీము |
| షాహిదాసు | జగత్ సింగు |
| జైమల్ | సంగ్రామసింగు |
| పట్టి | రణసింగు |
| సుక్త | ఆసాధు |
| జగదేవ | భిల్లునాయకుఁడు |
| ప్రతాపుఁడు | పురోహితులు |
| రామభట్టు | అక్బరుసేన |

### స్త్రీ పాత్రలు.

| | |
|---|---|
| కమల | సౌభాగ్యవతి |
| హైమాదేవి | మంగళాంబ |
| పద్మిని | ప్రతాపవతి |
| కుముదిని | గౌరాంబ |
| లక్ష్మాంబ | భ్రమరాంబ |
| శ్యామలాంబ | కాళి |
| జోడుబీ | పురస్త్రీలు |
| చిక్కతాయి | సుందరాంబ |

# శ్రీనివాసమహాకవి జీవితచరిత్ర.

---

ఎవ్వాని వదనరాజీవరంగస్థలంబున నలువరాణి నిచ్చలును నట్టువలు సలుపుచుండునో! ఎవ్వాఁడు కువ్యాఖ్యావిషమూర్ఛితయగు కాళిదాస కవితను కన్యకను దనదు సంజీవినిచేఁ దెప్పిఱిల్లఁజేసి బజ్జలమిన్నయని వన్నెకెక్కెనో! ఏమహాత్ముని దివ్యనామామృతమును వీనులారఁ గ్రోలనియట్టి రాసికుఁడొకఁడైన నీభువిని గానంబడఁడో! ఏమహితచారిత్రుని యశఃకుసుమంబుల ధరియించి దివాకర నిశాకరులు పుష్పవంతులను సార్థకనామమును బడసిరో!

ఏవిశ్వవిఖ్యాతుఁడు అనన్యజన సామాన్యమగు మహామహోపాధ్యాయ బిరుదమునకు మొదటిపాత్రుఁడయ్యెనో! అట్టి వశీకృతసకల శాస్త్రజలధి యగు కోలచల శ్రీమల్లినాథసూరి వంశమున మన శ్రీనివాస కవిముక్తామణి విరూపాక్ష క్షేత్రమునకు సమీపముననుండు కామలాపురమను గ్రామమందు క్రీస్తుశకము 1854-3-18 తేదీలకు సరియగు ప్రమాదీచ సంవత్సర ఫాల్గునాసిత చతుర్దశినాఁ డుద్భవించె. ఇతఁడు బాల్యముననే సంస్కృతభాషను జక్కఁగ నభ్యసించి, పిదప నాంగ్లేయ భాషయందు దసమానమైదుష్యమును గడించి, కొంతకాలము రాజకీయోద్యోగియుండి, తర్వాత న్యాయవాదిపరీక్షయం దుత్తీర్ణుఁడై బళ్లారి పురవరమున న్యాయవాదిగ నలరుచుండె. ఇతనికి నొకకూఁతురును, నలుగురు కుమారులును గలరు. మఱియు నితఁడు 1917 సం॥ ఏప్రెల్ 7 తేది దేవాలీపురమున జరిగిన విద్వత్సభ యని ప్రసిద్ధిఁ గాంచిన యాంధ్రసాహిత్య పరిషత్సభ కగ్రాసనాధిపుఁడుగ నియమింపఁబడియుండె. ఇట్టియఖండకీర్తిచంద్రుఁడు రాజవ్రణపీడితుఁడై యాంధ్రకువలయంబు వసివాడఁగుఁ బడకొంచ ఉల్లసిల్ల 1919 సం॥ [illegible] 28 తేది యస్తమించె.

ఇట్లు విన్నవించు,

సుజనవిధేయుఁడు,

రావాడి - వెంకటరామశాస్త్రి

ప్రధానాంధ్రపండితుఁడు, మునిసిపల్ హైస్కూలు, బళ్లారి.

సీ. ఘోరసవ్వాయోద్ధ వాఘోరకర్మంబులఁ
బాపెనేధీరుఁడీ భరతభూమి
తైమూరువంశాబ్ధి తారాధిపతి జెబ
రేధీరుతాతన్మై యెలమిమించె
విమలశీలత మించుహు మయూనుఁడె వ్వాని
తండ్రి యైకీర్తినిస్తంద్రుఁడయ్యె
సంకటజలనిధి సంభవించియు సౌఖ్య
వారిధిలోఁదేలెపీరుఁ డెవఁడు.

గీ. భరతఖండమేలి భవ్యుఁడై నిర్మల
యశము దిశలనెల్ల నాక్రమింపఁ
జేసెనెవ్వఁడట్టి శ్రీమంతు నక్బరు
కథను నాటకముగఁ గనుడిమీరు.

( నిమ్మ్రిత్రుము. )



# ప్రతాపాగ్బరీయము.

## ప్రథమాంకము - ప్రథమరంగము.

ఆగ్ర: పాదుషాస్థానము.

అక్బరు - బైరాము - పీరుమహమ్మదు - ఖాన్‌ఖాన్ - రాజామన్ - హేము

సేవకులు.

అక్బరు:— ఉ. కాననసీమఁ గ్రుమ్మరుచుఁ గష్టజలాంబుధి మున్గి తేలుచున్
దీనతఁ గుంది నాడు విడి దిక్కుమ తేదియు లేక చిక్కుచున్
మానిని వెంబడింప వనమార్గములం దుఁ గృశించెఁ బాదుషా
మానవ నేత దైవగతి మాన్పఁగ వచ్చునె యెంతవానికిన్.

సభాసదులారా! దైవమాయ విచిత్రంబు. ఏకచ్ఛత్రాధిపతిగ భరతఖండమేలిన నాతం హుమయూను కాలవిపర్యయంబున షర్షాయనువానికినోడి నాడువీడి నిలువనీడలేక, ప్ర మైక రాత్రిగఁ దిరుగుచుఁ దనమిత్రుఁడగు జోధపురమురాజు మల్లాదేవునిఁజేర నాద్రో స్నేహధర్మంబుమాని, పగఁబూని, నా తండ్రినిఁబట్టిచంప యత్నించెనఁట. హా హా! ద్రో మనిన నింతకన్న హెచ్చుకలుగునా?

చ. అడవినిఁజిక్కి స్రుక్కుచును నాఁకలి మెండయి సొమ్మసిల్లుచున్
బడలిక హెచ్చి దప్పిఁగొని, ప్రాణముఁబోవఁగనున్న దీనునిన్
బుధమిత్రుఁడైన నాజనకుఁ బుణ్యచరిత్రునిఁజూచి దేశమం
దడుగిడఁగూడదంచువిడనాడిన ద్రోహిని నుక్కడంచెదన్.

అక్కటకటా! ఆ మల్లాదేవుఁడారీతి స్వామిద్రోహమొనరింప నా తండ్రి సంకటపడి, నిండుగర్భముతోనున్న నాతల్లి నమ్మికతోఁగూడి, రాజదారులలో సంచరించుట గెంతునుగానక దప్పిఁగొని పాదచారియై యెట్టకేలకు దైవవశంబున నెటులనో అమర కోటఁ బ్రాణంబునఁ జేరెనఁట. అచ్చటి యధికారి దయాశీలుఁడయి నాతండ్రికి సాహా చేసి నాతల్లిని రక్షించెనఁట. ఎంతటియుత్కృష్టుఁడు బుట్టినను దైవానుగ్రహంబున నేఁ సుఖముగనుంటిని. అయినను నా [illegible] [illegible] కలుగకయున్నది. ఆ హీనుల హింసవు [illegible] [illegible] ఆశీర్వదంబు బలిపించి మాకంటిసలు [illegible]

హేమ:—( నవ్వుచు ) ఏమీ! బైరాం! మరణమునకు నే వెఱుతునని తలంచితివియా? ఎన్నటికి వెఱ వను. రణావని నీ శిరంబుఁ దఱుఁగజాలనైతినేయని చింతించెదనుగాని, నా మరణంబునకు నే వ్యసనపడను. ( అక్బరుంజూచి ) భూమిపాలా! ఆలస్యమేల? నీ సచివవర్యాని బోధనల నాలోచించి నా శిరము నైశెప్పింపఁదలఁగి నీ హితంబును స్థాపింపుము.

ఉ. పుట్టితిఁ బేదనై యీపుడమి, భూరివిపత్తు శ్రీనందికుందితిన్
కట్టిడివర్త కుండనయి కాతేయులందితిఁ గొంతకాలమున్
నెట్టితి రాజ్యమున్నవల సీజనకున్ భుజసత్వశాలినై
గిట్టఁగనేల దుఃఖమిఁకఁగీడ్పడి యంధుఁడనైన నృపాలకా!

భూపాలా! ఈ శరీరంబాపదే నేమనఁజాల.

బైరాం:—మహాప్రభూ! ఈ ద్రోహిఁజంపఁ నాలస్యమేల?

అక్బరు:—సచివవరా!

ఉ. ఉత్తమజన్మమంది నిఖిలోత్తమరాజ్యపదంబుఁ జెంది స
ర్వోత్తమనీతిధర్మముల నుగ్గుగఁగాంచిన భూమిపాలువా
లత్తునె యుత్తమాంగమున నత్యధికంబగు నక్షియుగ్మమున్
హత్తనివానిపైఁ దులి? నారయఁ నేమది రాజధర్మమే.

సచివవర్యా! కులాగతశాంతముంతయుమాని నాస్వాంతమీ దుర్బలునిఁజంపుమనిఁబూను నే? అసంఖ్యాకులై వచ్చి నన్నెదిరించు కతినాదుల శిరంబుఁదఱుఁగనేర్చిన నాకరవాలంబీ విగతాక్షుఁడగు నరునిపైఁ బ్రయోగింపనగునా? వలదు.

బైరాం:—( కోపమున ) ఇట్టి దయాశీలురు మీ వంశమువారు కావుననే మీరేలురాజ్యముల యందెన్నియో దోసంగులు పొసంగుచుండును.

కం. అరులుకిఁ దవిలినతఱి ని
ష్కారుణను జలమూని వారిఁజంపుట ధర్మం
బరయుము తప్పిన మున్పులు
నిరతము రిపువహ్ని రాజినిన్నంటున్నృపా!

అక్బరు:—సచివవర్యా! నా క్షేమమునకై నీవెన్ని హితంబు లుపదేశించినను జిక్కువడిన యీ యంధుని సంహరింపఁజాల. వానివిషయంబున నీ యిష్టానుసారం బేమయినను జేసికొనుము.

బైరాం:—( సేవకులంజూచి ) ఓరీ భటులారా! వీనిఁగొనిపోవుఁడి, వీనిపని నేను ముగించెద.

( సేవకులు హేమూనుబట్టుకొని నిష్క్రమింతురు. )

హిందూసైనికభటులు జోడుపూరు అంబరురాజులను దెచ్చి యెదుటనిలుపుదురు. వారు తల వంచికొని నిలిచియుందురు. )

అక్బరు:—( భైరామునుజూచి ) సచివవర్యా! ఈ ద్రోహులెవరు?

భైరాం:—మహాప్రభూ! వీఁడు ( జోడుపూరు మల్లదేవునిఁజూపి ) మరుదేశంబుననుండు జోడుపూరు రాజు. మల్లదేవుఁడను యీ ద్రోహినామము వీఁడు హుమయూను పాదుషాగారికి మిత్రుఁడైయుండి వారిచే ననేక సన్మానములంది, పాదుషాగారు షర్షాచే జయింపబడినతరిఁ దమ దేశంబున నడుగిడఁగూడదని యాజ్ఞయిడుటయేచాలక వారినిఁబట్టి షర్షాకు నప్పగింప యత్నించెను. వీఁడో ( అంబరు బలవంతదాసునిఁజూపి ) ఆ ద్రోహికి సాహాయ్యపడిన మహాద్రోహి. అంబరుదేశపురాజు బలవంతదాసు.

మ. మరుదేశంబున మిత్రులై మిగులసన్మానంబులన్ బాదుషా
ద్వారచేనందుచు నీదురాత్మకులయీ ద్రోహంబుల న్సల్పిరం
ధరణీపాలుఁడు రాజ్యమున్వదలి బాధన్జెందు కాలంబునన్
గరుణన్వీడి వధింపనాజ్ఞయిడుమా కల్యాణముల్పొందుమా.

మహాప్రభూ! అక్కటికముమాని, కటికవృత్తిఁబూని వీరికిఁ దక్కకలు నీకత్తికాహుతియగుట సర్వజన సమ్మత కార్యంబని నేనెంచెద.

అక్బరు:—( మల్లదేవునిఁజూచి ) ఓరీ ద్రోహీ! మల్లదేవా!

మ. ఓరీ! ద్రోహీ! కులాధమా! కుటిలమాయోపాయ! ఛీ! దుర్మదా!
రారాపుల్బడి రాష్ట్రమున్వదలి నీరాజ్యంబునన్ జేరఁగా;
క్రూరాత్మా! హుమయూను సాజనకుఁ జిక్కన్బెట్ట యత్నించితే
వైరివ్రాతముఁ జేరితే విభునకున్ బన్నంబులన్గూర్చితే.

( ఖాన్ఖానునుఁజూచి ) సేనాధిపా! వీరిఁగొనిపోయి కారాగృహంబున నుంపుము. )

అబ్దుల్ ఫజుల్:—(లేచి) మహాప్రభూ! సేవకుని విన్నపంబొకటి లాలింతురని వేఁడెద. క్ష్మాపతుల లోకోత్తరాభరణంబు క్షమాబుద్ధియని నిస్సందేహముగఁ బ్రాజ్ఞులు వచించిరి. అపకారికి నుపకారంబుసేయుటయె గొప్పమార్గమని నీతికోవిదులు వక్కాణించిరి కావున వీరిని మీరు మన్నించి యొక గొప్పయుపకారంబొనర్పవలెనని నా కోరిక.

అక్బరు:—మంత్రివర్యా! ఈ ద్రోహులకు నేనే యుపకారంబొనర్పవలెను?

అబ్దుల్ ఫజుల్:—మహాప్రభూ!

చం. మిగులదయన్ నృపాలక! క్షమింపుమవీరిని దండనార్హులే
యగుదురు గానివీరయిన నక్కటికంబును దాల్పుమామదిన్
బగఁగొనఁ బూనఁగావలదు పార్థివ! వీరియనుంగు బిడ్డలన్
దగుననినీవు జేకొనుము దారలుగా హితమైత్రి హెచ్చఁగన్;

మహాప్రభూ! వివాహసంబంధ బాంధవ్యబలంబున మీరాజ్యాభివృద్ధికిఁ గారణంబగు. మా రాష్ట్ర క్షేమంబున కాధారమగును.

అక్బరు:—మంత్రివరా! నీ వచనములు హితనీతియుక్తమ్ములని నే నెన్నెద.

అబ్దుల్ ఫజల్:—( బలవంతదాసునిఁజూచి ) తాతా! నాపలికినపలుకు మీకు సమ్మతముగదా?

బలవంతదాసు:—హా హా. అంతటిభాగ్యమా! ఈ పాదుషాచక్రవర్తి సంబంధముఁ గోరనివారెవరు? మా పెద్దలిట్టి సంబంధముల కింతకుమున్నే మార్గదర్శకులైనవారు. అవశ్యకము నా బిడ్డను చిక్కతాయిని వీరికినిచ్చి వివాహమొనర్చెద.

అబ్దుల్ ఫజుల్:—అదికదా లోకానుభవముఁగల వయోవృద్ధుల బుద్ధికుశలత. ( మల్లాదేవునిఁజూచి ) మల్లాదేవా! ఈ విషయంబున నీ వేమందువు?

మల్లాదేవ:—మంత్రివరా! ఏమిమాటలాడెదవు?

మ. తగునే నీవిటు మాటలాడఁగ విచిత్రంబౌఁగదా? హిందువుల్
వగవుల్ జెందినఁగాని యన్యకులసంబంధంబుఁ గాంక్షింతురే?
నగరే చేతులువట్టి భూజనులు ప్రాణంబుండు నందాఁక? మే
లగునే యిట్టియమానుషంబు? వలదయ్యా కీడగుఁ దీనిచే.

హా హా. ఇట్టిమాటలాడఁజెల్లునే? నిజమతావలంబనమతిగదా యార్యావర్తమునందలి భూపతుల భూషణము. మహమ్మదు, జలాలుద్దీన్, అల్లాయుద్దీన్, టోగ్లాకు మొదలగు పారసీకులు రాజ్యములఁజయించి రాజ్యలక్ష్మినిఁ జూఱఁగొనిరిగాని యీ యార్యావర్తంబునందు స్థిరముగఁ బాదుకొనిన హిందూమతము నిర్మూలము చేయఁజాలరైరి. ఈ శారీర తుచ్ఛభోగమునకై చిరకాలార్జిత మతమును దిరస్కరింపనగునే? నాకది సమ్మతముగాదు. ఇట్టిమాటలాడకుఁడు.

బలవంతదాసు:—ఏమి మల్లాదేవా! ఇటుమాటలాడెదవు?

మ. మలదేవా! వినుమౌర్ఖ్యమున్వలదు నేమంబంది ప్రాణంబునన్
నిలువన్ జూచుట రాజమార్గమగు హానిన్ గూడు వేళైననీ
కలికాలంబునఁ ద్రేతనీతివిధుల న్గామింపఁగాఁ బోలునే?
ఫలమే? శ్రేయమె? సేమమే? హితమె? వాగ్పారుష్య మీరీతిగన్.

మిత్రమా! దూరాలోచనపరుఁడవు నీవీరీతిఁ బట్టుఁబట్టిన గలిగెడుమేమి? ఎదిరించినచో ఫలమేమి? అనువుగానిచోట మేమధికులమని ప్రల్లదంబులాడికొనినఁ బ్రయోజనంబేమి? ఇదిమనకు క్షేమమా? మనప్రజలకు హితమా? మనరాష్ట్రంబునకు శ్రేయమా? మతాభిమానంబున మన మిప్పుడు ముష్కరవృత్తిఁ బట్టుపట్టితిమిపో మనకగులాభమేమి? మనను మనరాజ్యంబులను క్షీణించును. మనమర్యాద కెట్టులైనను నిలువవు.

## ద్వితీయరంగము.

### చిత్తూరు.

ఉదయసింగు - రవివర్మ - సూర్యసింగు - భాస్కరసేన - ప్రభాకరరావు - కమల.

ఉదయ:—సోదరులారా! ఢిల్లీపాదుషాగారు గొప్పసేనఁగూడి మనపురిపై దండువిడలినారని చారులచే వింటిని. వారికి క్షేమమే తప్పనర్చి కానము. మాపురి దౌర్భాగ్యమెట్టిదియో. బాపురా జీపురినెట్టి సమయంబునఁ గట్టించెనో, తెలియదు. పేరుపొందిన పారశీకులందఱుఁ జిత్తూరనిన నెప్పుడెపుడు దానిని ముట్టడించి కొల్లఁగొట్టుదుమాయని కాచియుందురు. అల్లాయుద్దీన్ యను పటాణి, సౌందర్య, తారుణ్య లావణ్య ఖనియైన పద్మినీముఖపద్మంబుఁ జూచి నంగాలునని ద్రోహము లెన్నియోపన్ని యీపురిని నశింపఁజేసెను. మరల నాకొండికాలమున మాళవాధీశుఁడగు బహదూరను వాఁడీపురి ముట్టడించి, రాజసరులఁజంపి రాజస్త్రీలన్ను గాల్చి రాజ్యలక్ష్మిఁ జూఱఁగొనిపోయెను. తురుష్కుఁడని పేరందినవాఁడెప్పుడును చిత్తూరుపైఁ గన్నుంచియుండును. ఇప్పుడీ మహాబలాఢ్యుఁడగు నక్బరు మనపురిఁ గాల్పఁ జూచుచున్నవాఁడు. భ్రాతృవరులారా! అక్బరనిన సామాన్యుఁడా?

సీ. బాలుఁడై వైరులగాలంబు ననుచిక్కి
దైవబలంబున దక్కినాఁడు
యౌవనంబందియుసందనినాఁడెయా
గురువిక్రముని శేకండరునుబట్టె
క్రూరసత్వంబునఁ దారిలో నెదురైన
శార్దూలమునుబట్టి సంహరించె
ధీరతమాళవాధీశుని నోడించె
నంబరాధిపునుక్కణఁచి తెచ్చె

గీ. జోదుతనకెందు లేదని సొక్కినిక్క
జోదుపురపతిఁ జెఱఁబట్టి స్రుక్కఁజేసె
నట్టిపటువిక్రమాఢ్యుఁడై యవనినేలు
నక్బరుని నోర్వఁగ మాకునగునె? వలదు.

కావున మనమాయక్బరుగారితో యుద్ధముసలుపక చెలిమిఁజేసి యీ నిర్భాగ్యపురినివదలి యుదయపురమునకుఁబోవుదము. ఇదిమీకు సమ్మతముగదా?

రవివర్మ:—ఏమీ! ఏమిమాటలాడెదవు? వైరితో యుద్ధము వలదా? చిత్తూరువదలవలెనా? ప్రాణంబులు తీపని దాఁపవలెనా? మనము క్షత్రియులము కామా? రాజసగుణంబు మనయందు దగ్గెనా. పౌరుషము మనయందు తగ్గెనా? యుద్ధమునిన మూపురములు మాడగు మేము వైరులకు

వినినమాత్రమున లోగ్గియుండుమా? బాపురాజ వంశస్థులింతకుదిగిరని యార్యులు వగచెదరా? అడుగు చేతులుదట్టినగరా?

శా. ఏమీ! క్షత్రియవంశదూషణ! భలా! యీశూరవంశోద్భవుల్
ధామాసంఘముబోలెనుండఁగలరే వైరుల్బ్రదింపన్? గుల
క్షేమంబైనను నెన్నఁగావలదె? సుశ్రేయస్కరంబైన యీ
భూమిన్ మేనునఁ బాయఁగాఁగలరె!! బాపూరాజవంశస్థులై.

చాలు చాలిట్టిమాటలాడకు. సేసినఁజాల.

సూర్యసింగు:— ఏమీ! ఉదయసింగు! క్షత్రియకులోద్భవుఁడగు నీవీరీతిమాటలాడఁదగునా? అగ్నికులనామంబు నీశౌర్యోచ్చాటనమంత్రమాయెనా? ఈ భీతినీయందుంచినవారెవరు? సింగరాజపుత్రుడిట్టి పిఱికిమాటలాడెనని జనులువినిన నీజననమూలంబు సందియింతురుగదా? ఇఁక నీవిట్టిమాటలాడకు.

శా. ధీరుండైజగమేలఁగాంచెను శిలాదిత్యుండు; బాలుండు తా
వీరుండై జగతిన్ జయించెను గుహుఁడా విఖ్యాతనాముండు భీ
మారిప్రాతమునుక్కడంచుచు యశంబార్జించి కట్టించె బా
పూరాజీపురి? దీనిఁ బాయనగునే భూమీశ ప్రాణంబునన్.

భాస్కరసేన్:— ఉదయసింగు! నీకెంతటిపిచ్చిమాటలాడితివి? శత్రువులే చెనన్న సంధికోరుట క్షత్రియ ధర్మమా? క్షత్రియస్త్రీలకు నైకమింతటి పిఱికితనంబు పుట్టదుకదా? నీవింతటిదుర్బలుఁడవని యా పాదుషా తెలిసినచో క్షత్రియ స్త్రీలనందఱినిఁదన కప్పగింపవలెనని యాజ్ఞయిడును. అటుచేయసమ్మతియా?

కం. వెడమాటలాడ వలదిఁకఁ
పోడుమవగు మనబలముఁ జేర్చిపోరుము జయమున్
బడయుము! క్షాత్రియధర్మముఁ
జెడనటులోనరించి యశముఁ జేకొనుము! వడిన్.

ప్రభాకరరావు:— హా! హా! ఉదయసింగు! నీకీపురిపై నించుకైన నభిమానంబు లేదుకదా? ఈ పురివదలిపోనగునని యొంతసులభముగ మాటలాడితివి? నీజననమూలంబు నీమాటలు వెలివేయుచున్నవి. బ- భీరుచేఁ జంపఁబడినవాఁడు సింగరాజపుత్రుఁడగును కాని దాసీపుత్రుఁడు కాదని యిపుడు స్పష్టమగుచున్నది. తనపుత్రుఁడగు విక్కు రాజును జేయఁదలంచి దాసిమమ్ము మోసగించెను.

కం. మోసం దేహముఁదీఱెను
దాసీపుత్రునకు నేల ధైర్యముకలుగున్?
మోసంబయెుఁగులమునకును
వాసియువన్నెయునుచఱిగె, వాటిలెనిందల్.

మిత్రులారా! రాజనియోగులాధముని ముఖావలోకనము సేయుట పాతకహేతుకంబు. కులటతో మదనోత్సవ మింపగునటుల వీనిమానసమునకు వైరులతోఁ రణోత్సవమింపుగా లేదు. మనము వీనిఁ గూడి రణమొనర్ప నలవి కాదు. రండు వెళ్లుదము.

(ఉదయసింగు తప్ప నందఱు నిష్క్రమింతురు.)

ఉదయసింగు:— అయ్యో! ఈ దురాత్మకులకు నాహితమ్ము విషమయ్యెఁ గదా? నన్నెన్ని మాటలాడిరి? సమయము కాదని మిన్నకయుంటిని. కాదేని వీరి కండలు తుండ్లతుండ్లుగా ఖండింపనె?

చ. భుజబలగర్వయుక్తులయి భూపతి నేనని యైన కొన్నఁగీ
కుజనులు నోరుకుళ్లఁగను కుత్సితముల్ వచరించిరక్కటా!
నిజము నెఱుంగరైరి, రణనీరధిమున్గెడు వేళ సైన భూ
భుజుఁడు యథార్థమాడెనని పొక్కి తలంతురు నాహితంబునన్.

(చింతించుచుండును.)

(కమలప్రవేశము)

కమల:— (తలవంచికొనియున్న రాజునిం జూచి) ఏమియీయచ్చెరువు? నను జూచిన క్షణముననె లేచివచ్చి కరుణించి కౌగలించి లాలించి సరసాలాపములాడకయీ మోహనాంగుఁ డిటు చింతాసతికి స్వాంతమంతయు నప్పగించి యేమియుఁ దెలియకయున్నవాఁడు? ఇదియేమో రాజకార్యాలోచనముగనున్నయది. మాటలాడించిచూచెద. (పరసఁ జేరి) మోహనాంగా! ఇంతటిదీర్ఘాలోచనపరుఁడవై యధోలోకావలోకనము సేయుచు నెదుటవచ్చిన నన్ను మాటలాడింపక మౌనముద్రను ధరించినావు? అంతటి కార్యమేమి తటస్థించెను?

ఉదయసింగు:— (నిట్టూర్పు సారించుచు) మోహనాంగీ! ఈయవమానకరమైనవార్త నేనేమని తెలుపుదును? నామానసంబు పరిభవకీలలలోఁ బడి కాలుచున్నయది.

కమల:— ప్రాణప్రియా! అంతటియవమానం బెవరిసుండి కలిగెను?

ఉదయసింగు:— ప్రేయసీ! నాజ్ఞాతులు నాసేనాధిపతులు నన్నె ధిక్కరించి కులహీనుఁడని కుత్సితములాడి నామానసం బెల్లఁ గలంచిరి. చేయునది లేక మ్రోడ్వడినమానువలె నూరకయుంటిని.

కమల:— మోహనాంగా! ఏవిషయంబున నింతటి వాగ్వాదంబు కలిగెను?

ఉదయసింగు:— నాతీ! డిల్లీపాదుషా భూరిబలయుక్తుఁడై వారిపై దండెత్తివాడఁట. ఇప్పటిస్థితిగతుల నాలోచించి యుద్ధము వదలి పాదుషాతోఁ జెలిమి వాఛింప వలెననియాడితి. ఆమాటలకా ద్రోహులాగ్రహపడి, నోటికసిఁదీఱ ననుఁదిట్టి నాముఖావలోకనము పాపమనిదూసి వెళ్లిపోయిరి. యత్నము మీఁదటె మిన్నకయున్నవాఁడను.

కమల:— మోహనాంగా! వారియెదుట నీవు త్వరపడి నీ యభిప్రాయంబు వెల్లడితిఁ గాఁబోలు. మంచిది. ప్రాణేశా! నీ మనంబున కహితంబుగ మాటలాడితి నేయుని నామాటఁ గినియక సమ మన్నింతువని వేఁడెద. ఆహవము ధరాపతులకు శుభావహము, కావున రణమావలదనుట

కాలధర్మముగాదు. పారశీకులబలమునకన్న మనబలము హెచ్చుగనున్నయది. అంతియ నతిశయముగ మనకుస్థానబలమున్నయది. ప్రాణరక్షణమునకై పోరువారువైరులు. మన మంతయుగాక జననావనీ యభిమానంబునఁ బోరువారము. ఇచ్చటి దుర్గమస్థలంబరుల కగోచరంబులు మనకు కరతలామలకంబులు. కావున జయము మనదగుననుట నిస్సందేహము.

ఉదయసింగు:— మోహనాంగీ! నీమాటలు నాకలఁతలుదీర్చి కలనికి నా మానసంబును బ్రోత్సాహ కలిచెను. ఇదికదా నీ సామర్థ్యము.

కమల:— మోహనాంగా! నాపైఁ మీకుఁగల ప్రేమాతిశయంబున మీరు నన్నిటు పొగడుచున్నవారు. ప్రాణప్రియా! నాకు మఱియొక కోరికగలదు. మీకేమనికొందురోయని భీతిల్లుచున్నదానను.

ఉదయసింగు:— నాతీ! భీతియేల? నిర్భీతిగఁ బలుకుము.

కమల:— మోహనాంగా!

చ. దురమును జూడనామదిఁ గుతూహలమున్నదికాన, నేనుమీ
సరసను నిల్వనాజ్ఞయిడి సత్కృపఁబ్రోతు రటంచు వేఁడెదన్
శరిగమనల్ రణా వనికిఁగర్హ్వ లటంచని యెంతురేని మీ
పురుషుల దుస్తులన్ దొడఁగిపొందుగ నుండెద మీమతుంగునన్.

మహాప్రభూ! ఇదియనాకోరిక.

ఉదయసింగు:— మోహనాంగీ! రమణులెక్కడ రణమెక్కడ? అంగనలు కుసుమకోమలాంగులు. రణము వైరివారశరజాల భీకరాంగణము. కావున నెసుఁబోలు వనబోణులు రణభూమి నిలువఁజాలరని సందియుంచెద.

కమల:— ప్రాణకాంతా! నీ ప్రియురాలంతటి పిరికికాదు. నీకేసందేహమువలదు.

ఉదయసింగు: — మోహనాంగీ? అటులైన పురుషరూపంబుదాల్చి నావెంటనుండుము. పోవుదము రమ్ము.

[ నిష్క్రమము. ]

## తృతీయరంగము.

### చిత్తూరు యుద్ధము.

### హిందూ మహమ్మదన్ సేన.

### మహమ్మదన్ సేనపఱుగిడుట.

---

## తురీయరంగము.

### చిత్తూరు.

### రామసింగు - లక్ష్మణసింగు.

రామసింగు:— లక్ష్మణసింగు! ఆ తురుష్కులను నిర్ధూమధామముగ నొనరించితిమి. ఆ పారసీకులు లోఁకలుముడిచికొని పఱుగిడిరి.

లక్ష్మణసింగు:—అవును రామసింగు! ఆ యవనాథములుక్కు మీఱి, మూసేనఁ దాఁకి, చెక్కు చెండాడు చుండ, నొక్క పేసిమూఁకిబాలుఁడు మనదొరగారి ప్రక్కనుండి లేచి విజృంభించి, యభిమన్యునిబలె శాత్రవమండలిఁ జొచ్చి, చిక్కినవారినిఁ జిక్కినట్టెల్లఁ జెక్కి, దిక్కుకొకరు పఱుగిడులాగొనరించెను. వాఁడెవఁడుండును?

రామసింగు:—లక్ష్మణసింగు! అచ్చెరువంది అచ్చవడినిలిచి యాచిన్నవాని మొగ మెగాదిగఁ జూచితిని. మరలఁ జూచితిని. మఱిమఱి పలుమారు చూచితిని. నాకేమో సందియముగనున్నది.

లక్ష్మణసింగు:— అదిఁయేమయా నీ సందియము?

రామసింగు:—ఆ బాలుని మోముపై నాడేఁగులచాయ యున్నది. నడకనైతే మటులనేయున్నది.

లక్ష్మణసింగు:—అట్లయినఁ బురుషరూపమును ధరించిన స్త్రీయనియా నీ తాత్పర్యము?

రామసింగు:—అవునయా! నిజము.

లక్ష్మణసింగు:— అటులైన యాస్త్రీ యెవతెయుండును?

రామసింగు:—అదియనాకు సందియముగనున్నది. మెఱుపువలెనించుక ప్రజ్వలించి మరల వారాజమునని మఱుఁగుఁ జేరెను.

లక్ష్మణసింగు:—అది మారాజుగారి అంశ కమలాంబయుండునా?

రామసింగు:—అవునయా! అవును. నిస్సంశేహమిది. నాఁకుఁదోఁపకపోయెను. ఇతర స్త్రీ కంతటి తెగువ కలుగునా? చిన్ననాఁటినుండి కత్తిపై సాముచేసిన యాటకత్తెయది. తరుణి తెగించి నిలిచినతటిఁ బురుషులు దానికెదురై నిలుతురా?

లక్ష్మణసింగు:—నిజము. ఈదినమున రాజాస్థానమున సేనాధిపతులు చేరెదురు. మనముపోయి చూచి వత్తమురమ్ము.

[ నిష్క్రమణము. ]

పంచమరంగము - చిత్తూరు.

ఉదయసింగు - కమల - రవివర్మ - మొదలగు సేనాధిపతులు.

రవివర్మ:—మహాప్రభూ!

చం. యవనులు కాందిశీకుల యిరాజియు నాశయుమాని; కాళ్లకున్
జవనవిశేషనై పుణినిఁ జయ్యనసేర్పుచు, శైలవాటికల్
భవనముగాఁ గుదుర్చుకొనఁ బాఱుచు, మాకుయశోధనం బునున్
సవరుగనిచ్చి చింతయను చానను బొందిరి దుర్యశంబుతోన్.

ఇట్టి పరాక్రమవంతులు రణధీరులు మేమిందఱుమేమున నిచటనుండ ఖండనమ్మువలదని వదఁ దుష్కీర్తిఁ దెచ్చికొనుచుంటిమిగదా! మనపాలిదైవ మెంతటియుత్తమసమయుంబె మమ్ముఁ దప్పించెను.

[ కమల ప్రవేశము. ]

[ రాజు లేచి దాని కరకంజము కేలఁ గొని. ]

శా. రావే! రత్నమ! రాజభూషణమ! యోరాకా శశాంకాననా!
రావే! సామజయాన! చారుతరసారంగేక్షణీ! యిటులన్
రావే! ధీరవు నీవు సంగరమునన్, రాజ్యమ్ము నీసొమ్మయెన్
రావే! నీదగు శౌర్య మెంతయని యో రామామణీ! యెన్నుదున్.

భామా! ధైర్యధామా! నీ శౌర్యం బెంతని నే వర్ణింతు. సింహబలగర్వా! ఈ సింహాసనంబునకుఁ నీవ తగుదువు కాని మఱియెవరును తగరు.

కమల:— మోహనాంగా! స్తుతిపాఠకులవలెనె నీ వెన్నఁడు విద్య నభ్యసించితివి? నేనన నెంత? నా శౌర్య మన నెంత?

ఉ. ఏలెదు సామి నీవగుచు నింత నుతింతురె నన్ను? చాలు, నా
మేలు వలంతు వేని విరమింపుము నీస్తుతి, వీరశూరులై
యాలమునందు వైరినివహాగ్నిని నార్చిన ధీరులిందఱే
యాలయమందు నుండ నను వారె టునన్నిటు మెచ్చఁగా? నృపా.

మహారాజా! నను నీవు మెచ్చకున్న నాకు నీ రాజ్యమిచ్చినంతటి యుపకృతిఁ జేసినవాఁడవౌదువు.

ఉదయసింగు:— భీతహరిణేక్షణీ! నేను నీవాఁడనై యుండ నెవరికేమి భయము? సంగరంబున నీవు కదా మము నెల్లరఁ గాపాడితివి. నా రాజ్యము నిలిపితివి. క్షాత్రియాభిమానంబు రక్షించితివి. అవి యెదియన నేల?

ఉ. మూరెడు మీసలన్ పెనచి ముప్పిరిగాఁ బలుమారు దువ్వుచున్
నేరువు మీఱ దుస్తులను నీటుగఁ గట్టుచు పాలుఁ బట్టుచున్
ధీరులమంచు నోటికసిఁ దీఱఁగఁ బ్రల్లద మాడునట్టి యీ
భీరులఁ బోలక నీవు రణభీకరవైతివి దక్కఁ గీర్తియున్.

సూర్యసింగు:— [లేచి] ఓరీ! దుష్కులాధమా! నీవొక రాజువని నే మన్నింతును. కులీనుఁడవై కులటను తలపై నెక్కించుకొనిన తప్పొకటి చాలక యభిమానము పేర్మిఁ జెలఁగిన గొప్ప యుద్ధ శూరుల మానసంబులు కలఁచెదవా?

మ. ఖల! దుష్టాత్మక! దుర్మదాగ్రచరితా! గర్వంబునన్ మించుచున్
కులటన్ బెద్దఁగఁ జేసి వీరవరులన్ గుందింపఁగాఁ బూని తే
వెలయాలెచ్చగు నించు విల్తునిరతిన్ విఖ్యాతి నందెత్తుటే
గలనన్ బోరి జయించె శూరులననంగా నవ్వరే భూజనుల్.

[illegible] దురాత్ముఁడు రాజ్యపదార్హుఁడు కాఁడు.

భాస్కరసేన:— వీఁడు జారిణిఁ దనకు రాణిగ నొనర్చికొని గౌరవవంతులగు మమ్ము పరిభవించాఁడు.

కం. ధరణీపులకు ప్రశస్తంబగు
వరసింహాసన మునందు వారవనితను౯
జరభిని నుంచెను గావున
ధరణిని వీడుంటఁదగదు తగదు వధింతు౯.

[ అనుచుఁ గత్తి ఝళిపించును. ]

ప్రభాకరరావు:—మిత్రులారా! విషయాధీనుఁడై వీఁడు స్త్రీకిఁ జిక్కినవాఁడు కావున వీఁడున్మాదుండై విచ్చలవిడి ముచ్చటించెడు. వీనియున్మాదంబు నేనుడింపెద. ( అనుచుఁగత్తి వాలం బెత్తి కమల నీక్షించుటకును కమలక్రిందఁబడును. )

( సేనానులందఱు తమతమగృహములకు వెళ్లిపోదురు. )

ఉదయసింగు:—హా. హా. మోహనాంగీ! ఇంతటికల్లుషకర్మంబాదురాత్మకులు నీకొనరింతురని నేఁ గలనైనఁ దలఁపనైతిని. అయ్యో! మోహనాంగీ! ఇట్టివికదా దైవవిచేష్టితంబులు? కోరికలు కొమ్మలువోవ నీ దినంబునఁ గదా నీ సుఖసంగతికి నుల్లాసము చెందుచుంటిని? ఇపుడుగదా నీదుర్గతిఁ గనులారఁ గాంచుచున్నవాఁడను? నాబహిఃప్రాణమా! ఆ పాపాత్ములు నన్నెదిరించి చంపక యబలవగునిన్ను పాపంబనక చంపిరికదా? ఇఁక నేనేమని యీ నిర్భాగ్యపు నగరమునందుండుదు నేనుండఁజాల నుండఁజాల. నా రాజ్యమునకు ముఖ్య నగర ముదయపురిగ మార్చికొని యచట సుఖముననుండెద. క్షత్రియులీపురిపై నభిమానంబున వదలఁజాలరు. కావున నిచటనే చావనిమ్ము. నేనిఁక నిటునిలువఁజాల. ఈ దినంబుననే విడలెద.

తే. గీ. ఈపురమ్ము ప్రాంత మెట్టిదో చెప్పఁగరాదు
పుట్టువాడిగఁ దుష్కల పోరుహెచ్చె
సంపదల్పోయెఁ బోయిడి సతులుచితిని
జననసగరాభి మానంబు చనదునాకు.

( నిష్క్రమము. )

శ్రీ

# ప్రతాపాగ్నిరీయము.

ద్వితీయాంకము - ప్రథమరంగము

చిత్తూరు.

" కాళి "

కాళి:— హా హా శ్మశానమునఁ బోలె యీపురి నేనుండ నేల? ఈపట్టణం బరాజకమై యెన్ని వర్షంబులయ్యెను? అనిర్భాగ్యుండు వయసింగు తన జననభూమి పైనభిమానంబు మాని శూరులగు తన పుత్రులతో నుదయపురిఁ జేరెను. రాజతనయుల రక్తము పానీయముగ నాకొసఁగుచుండిన నీకోటఁ గాచుచుండెద నని బాప్పారావునకు మాటయిచ్చియుంటిని. ఇపుడు రాజపుత్రులెవరి? వారి రక్తమేదీ?

సీ. రాచకుమారుల రక్తమిచ్చిన నేను
        కోటఁ గాచెదనని పూఁటపడితి
అలియుద్దీనుని యాజ్ఞఁ బంచున్న రాజ
        తనయుల రుధిరముఁ ద్రావఁగంటి
బహదూరుఁడొనరించు భండనమ్మున
        ధరాధవుల శోణితమెల్లఁ ద్రావఁగలిగె
రాజు లేదయ్యెఁ గారాణింపఁగా నేడు
        దాహమయ్యెడు నికఁ దడయలేను

గీ. అయ్యలను నేఁడు నేవీడి యన్యమతము
    వారిపురములఁ జేరుచు వారిఁబోలె
    కూరులగువారి క్షతజమవారిగాను
    ద్రావి తనియుదు, నేటికొకవారిఁగాన.

అయ్యో! ఈకోట పై వసతిఁ జేసికొని యెన్నిశతాబ్దములుంటిని. వాత్సప్తికి రాణిగారల వాఁడు తనకొమారులకు పండ్రెండుగురికి పట్టముఁ గట్టి నాకు బలిగనిచ్చిరిగదా? వారిరుధిరము ద్రావినగదా ద్వినవమ క్షత్రియాంగనలచితి కతంబున గలిగిన దాహ మార్చికొంటిని. మరలఁ గొన్నిదినంబు లుపవాసంబు చేసి మాళవాధీశుఁడగు బహదూరుదండెత్తినపుడు, నాలుగువేల స్త్రీలు కాలిన పెనుమంటల దాహము. హిందూరాజుల రక్తపానీయమున నార్చికొంటిని. అక్బరు పాదుషాయీతూరి యీపురిని నశింపఁజేయును. అకాలంబున క్షత్రియ స్త్రీల సేకులు తప

పద్మిని లోకోత్తర సౌందర్యవతియని యెఱిఁగి అల్లాయుద్దీనను వాఁడు మనపురిపై దండెత్తి మనపూర్వికుల నెల్లరఁ జంపి యాసతీమణినిఁ గొనిపోవఁ బురము ప్రవేశించెను. పద్మిని పురంధ్రీమణి కావున క్షత్రియాంగనలకెల్లను మానరక్షణము నుబోధించి చితి నేర్పఱచి వారితోఁగూడఁ దానునుంబడి సద్గతినందెను. క్షత్రియాంగనల మానము కాపాడెను. క్షత్రియ స్త్రీల పాతివ్రత్యము స్థాపించెను. క్షత్రియవనిత తెగువ భూతలమున నెగడ నటులొనరించెను. క్షత్రియతరుణులు తమగౌరవంబు రక్షించుకొను మార్గ మిట్టిది యని మార్గదర్శకురాలయ్యెను. ఇది సంభవించి మూఁడువందల వర్షంబులయ్యెను. మరల యిప్పటికి ముప్పది యేండ్ల క్రిందట బహదూరుఁ డీపురి నశింపఁ జేయఁబడినపుడు మనరాణి కమలావతి పదమూఁడువేల క్షత్రియాంగనలఁగూడి యగ్నిప్రవేశ మొనరించి మనజాతిమర్యాదఁ గాపాడెను. సోదరీమణులారా! ప్రస్తుతము మనకంతకంటె హెచ్చగు నాపత్తి సంభవించుతఱి తటస్థించినది కావున మీరెల్లరు నేకభావముగలవారై పావకునకు నాహుతియగుటకు సిద్ధపడియుండవలెను హా!

చం. వరసతులార! వీరవరవర్ణినులార! విరోధులీపురిన్
జొరఁబడి సర్వసంపదలఁ జూఱగొని మమ్ముహరించి, యక్కటా!
పరిభవమందఁ జేయుదురు పాడిదొఱంగుచుఁ గానయిత్తఱిన్
బరసుఖముల్ దలంచి మనపద్మినిఁ బోలఁగ మీకుఁ జెల్లదే?

కుముదిని:— మాతా! పతిపోవు పథమనుసరించిన సతికదా పతివ్రత. పతిరణక్షితిసద్గతినొందినతఱి, సతి చితినంది సద్గతిఁ జెందుట సహజముగదా!

కం. పతిపరగతి నందినతఱి
సతి చితినందుటయ కాదె సద్గతి క్షితిలో?
పతిఁబాసి క్షితిని నిలిచెడి
సతి సతియే! చలనసహిత శవముగఁగాదే.

మాతా! అట్టి యాపద సంభవించినసమయమున, కీలికీలలందు దప్తమగు మా శారీరమాంస పచన సంబంధపరిమళంబు పారశీకులు పవనబలవశంబున మూర్కొందురుగాని మాసుఖమైనఁ జూడఁజాలుదురా? అట్టిసందేహంబు మీకు వలదు. నిర్భీతిని మనపురుషులు వైరులనుమార్కొని జయలక్ష్మినందనిమ్ము. కానిచో ముక్తిరమాపతులుగానిమ్ము.

హైమాదేవి:— సోదరీమణులారా! అటులైనఁ జితిసిద్ధపఱచియుండెద. కోటవాకిలి తెఱచి మనవారు యుద్ధమొనర్చుచు వైరులు పురిలోఁ జొరఁబడు సూచన మీరుగనిన క్షణముననె మీరా మారణకర్మంబొనర్చి మానము గాపాడికొనుడి. నాకుఁ జేయఁదగినపని విశేషముగ నున్నయది. నేఁ బోయివచ్చెద.

ఇతరస్త్రీలు:— చేయుదుము వేవము.

(నిష్క్రమణము.)

## తురీయరంగము.

### చిత్తూరు - అక్బరుసేన.

[కోటలోను కోటపైనను హిందువులసేనయుండును. కోటవెలుపట అక్బరు పాదుషా, యతని సేనలును కోటపైనుండువారిని కాల్చుచుందురు. కొందఱు కోటపైనెక్కి కార్యంబొనర్చుచుందురు. కొందఱు కోటగోడెక్కుదురు. ఇటుజరిగినపిదపఁ గోటవాకిలి తెఱవంబడును. హిందువులకు మహమ్మదీయులకు యుద్ధము జరుగును. యుద్ధమున జైమాదేవి పద్మిని పట్టా యనువారు నుజంపి తాముజత్తురు. హిందూసేన సకలమునశించును. తురకలు పురిఁబ్రవేశింతురు. లోఁగా క్షత్రియాంగనలు పసుపుఁజీరలుగట్టుకొని యగ్నిఁజొరఁబడుచుందురు. అక్బరు దానిం జూచి జాలిఁజెందు]

అక్బరు:— క్షత్రియాంగనలారా! వీరమాతలారా! పరమపతివ్రతలారా! మీసాహసమిఁకఁజాలింపుఁడు. మీ మర్యాద కేలోపము కలుగకుండునటుల నేరక్షించెద. భయపడకుఁడి. చితిలోదుముకుట నిలుపుఁడి. అయ్యో! వలదు. వలదు. ఇంతటిమారణకర్మంబువలదు. నిలుఁడి నిలువుఁడి.

(స్త్రీలందఱుఁ జితిలోదుముకుదురు.)

హా. హా. క్రూరకర్మంబనిన నింతకన్న హెచ్చైనదిగలదా? ఔరా క్షత్రియ స్త్రీ సాహసము!

శా. ఔరా! క్షత్రియజాతి నీతివిధి! మేలౌరా తదీయాంగనా
ధీరత్వంబు! కనంగఁ జిత్రమగుఁగాదే? సాహసం బెంత! యీ
నారీరత్నములెల్లఁ బ్రాణమునకన్నన్ మానమే మేలటం
చీరీతిన్ జితిఁజొచ్చిరాహా! కనలేమీ జాతిసామ్యంబిలన్.

హా! చూడనసహ్యంబిది. నేనేలుధారుణి నిట్టిక్రూరకర్మంబు జరుగనటులఁజూచెద. ఏమీ! విధికృతంబున నొకతానొకపతి చితిఁగలసినమాత్రాన, విధిరోధంబుగ సతిచితిఁగలయనేల? ఇది హిందువులనీతివిధిగనుండినను నాయావచ్ఛక్తిఁజారవోసి,సర్వప్రయత్నములొనరించి,యీ ప్రాణహంత సతీమారణకర్మంబు నిలిపెద. నా కార్యంబయ్యెను. నేనిందుండి చేయునదేమి? ఈ యుద్ధమునందు జైమల్, పట్టా, జైమాదేవి పద్మిని వీరసత్పురుష సాహసంబొనరించిరి. కావున వారివిగ్రహంబులు సలిపి యీ కోటవాకిలి నిలిపెద. పోయెద.

(నిష్క్రమించును.)

ప్రవేశము - రామసింగు - లక్ష్మణసింగు.

లక్ష్మణసింగు:— ఇచటజరిగిన యుద్ధమంతయుఁ జూచితిమిగదా. ఇఁక మనముదయపురికేగి మనరాజు గారికీవార్త నొకటితప్పక తెలుపుదము.

రామసింగు:— లక్ష్మణసింగు! మనవారినాశనము మేమేమని నోటఁబలుకఁగలము? అయ్యో! క్షత్రియులెందఱు చచ్చిరి? హా. హా! క్షత్రియకులాంగనలెందఱు చితిఁగలసిరి?

లక్ష్మణసింగు:— మనమేమి చేయఁగలము? ఏడ్చిన వచ్చుఫలమేమి? పోవుదము రమ్ము.

(నిష్క్రమింతురు.)



# ప్రతాపాగ్నరీయము.

తృతీయాంకము - ప్రథమరంగము

ఉదయపురి.

ఉదయసింగు - ప్రతాపసింగు - సుక్త - జగదేవ - కుబేరసేన - రామసింగు
లక్ష్మణసింగ్.

**ఉదయసింగు:—** (కుబేరసేనునిఁజూచి) సచివవరా! చిత్తూరునందు జరుగు యుద్ధమెటుల పరిణమించెనో? ఆవార్త యేమయిన నీవు వింటివయా?

**కుబేరసేన:—** మహాప్రభూ! ఇదివఱకు నేనేమియు వినలేదు. అచటికిఁ బంపిన చారులింకను రాలేదు.

(రామసింగు లక్ష్మణసింగు ప్రవేశము.)

**రామ లక్ష్మణసింగు:—** (రాజునిఁ జూచి) మహాప్రభూ! వందనమ్ములు.

**ఉదయసింగు:—** చారులారా! చిత్తూరు సమాచారంబేమి?

**రామసింగు:—** మహాప్రభూ! తెలుపుటకు వ్యసనంబగుచున్నది. మనవారి కార్యమెల్ల నుడిగెను. జనులు నశించిరి.

**లక్ష్మణసింగు:—** స్త్రీలందఱగ్నిలోఁబడి కాలిరి. పురము పాడుపడెను.

**ఉదయసింగు:—** (నవ్వుదు) చూచితివియా కుబేరసేనా! ఆ పొగరుబోతులకుఁ గాఁదగినపని యయినది.

చ. వికటఫలంబు తామనుభవించిరి గర్వముచే క్షత్రియుల్
సకలము మున్నెఱింగికద సాహసమిత్తఱిఁ గాదటంచు వా
రకపలుమారు పల్కితిని రాజహితంబు నిరాకరించి రా
వెకలులు బుద్ధిహీనులయి వీడిరి వీడును బ్రాణముల్ వారల్.

వారికిఁ గాఁదగిన శాస్తియాయెను. నేఁడు కదా నా మానసంబమందానందంబు చెందెను.

(ప్రతాపుఁడు నిట్టూర్పు విడుచును.)

(సుక్త లేచి కత్తినంది తన వ్రేలొకటి తెగఁగోసి నెత్తురుఁ గార్చును. దానింగని)

**ఉదయసింగు:—** అయ్యో! అయ్యో! ఎంత చిరక్తము! ఏమియది? ఎందుకటులాయెను. నేఁజూడఁజాలను

**సుక్త:—** తండ్రీ! క్షత్రియకులంబునఁ బుట్టి రక్తము చూడఁజాల ననిన, వినిన వారు నగరా?

శా. ఏమీ! భూభుజులై ధరాధిపతులై యారక్తమీక్షింపఁగా
నీమేని గతి సంచలింపఁగనె! నిర్భీతి యుద్ధంబునన్

భూమీశులో రుధిరప్రవాహము సంపూర్ణంబుగా నీదరే
భామలో బ్బలుచునింటనుండఁగలరే ప్రాణంబుపైనాశచే?

ఉదయసింగు:— హౌరా పౌరుషము! (నవ్వుచు) అటులయిన నీవును శత్రువుకు వెళ్లి యుద్ధమొనర్పుము. అప్పుడుకదా నీపని తెలియును.

ప్రతాపుఁడు:— (లేచి) తండ్రీ! క్షత్రియజాతికి దుష్కీర్తివచ్చునేయని దుఃఖంబున నీరీతిఁ బలికినాఁడను. బలుపలుకుట పాడిగాదు.

చం. పలుకకు మీవిఁక జనక! సామకురీతిని శూరుఁడైతెనేఁ
దలఁకక వైరుల న్గనిసి ధైర్యము వీడక పోరునప్పుడుఁగాఁ
గలుగుయశంబు కాని యెడఁ గాంతలకున్ మనకున్ విభేదముల్
గలుగునె? నవ్వుటాలకును కాఁదుకొదిదిగ్గమ్ము మామదిన్.

నాయనా! నీయెదుట హెచ్చుపలుకఁజాల. నీరీతి క్షత్రియధర్మంబు నలుపుట మానుదు వని వేఁడెద.

ఉదయసింగు:— ఏమిమూఢులారా! నన్నా మీరెదిరించి మాటలాడెదరు? ఈ బుద్ధి మీకునెవరునేర్పిరి?

చం. ఎదిరించి నన్నిట్లు పలుక నెంతటి వారలు మీరు? ధర్మమల్
పదిలమటంచు నాకుఁగనుపన్ గనుపెంతటి సాహసంబు? ఛీ
పదరకుఁడీ హితంబులిఁక ప్రాణముఁ గోరితిరేని చాలు నా
యెదుటను నిల్వఁ జెల్లదు సుమీ యిఁక వెళ్లుఁడు మౌనముద్రతోన్.

మూర్ఖులారా! మౌనమువహించి యిచటనుండి వెళ్లుఁడి.

శుక్త:— తండ్రీ! మౌనమువహించి పోవునంతటితప్పు మేమేమొనర్చితిమి? మౌనము మానినులకు భూషణముగాని పురుషులకుఁగాదు.

ఉ. మౌనము వారిజాననల మానధనంబగుఁ గాని వాలుచేఁ
బూనినవానికిన్ దగునె? భూభుజజన్మము గాంచువానికిన్
జానగునే! వృథావచన జాలము లేలిఁక యింకజాలు? శూరతన్
గాననివాఁడు క్షత్రియుల గర్భము చేటగుఁగాదె ధారణిన్.

ఉదయసింగు:— (కోపమున) ఓరీ. [illegible]పోతా! శుక్తా! నీవిఁక ప్రాణంబువనుండిన నాకవమానంబు దెచ్చుటయగాక నా రాజ్యంబునకుఁ గీడుదెత్తువు కావున నీవు హంతవ్యుఁడవు. ఇప్పుడే చంపించెద. [ప్రతాపునిఁజూచి] ఓరీ నీవధికప్రసంగివి. నీ ముఖావలోకనంబు సేయఁదగదు. నా యెదుట నీవెప్పుడైనను బడకు. వెళ్లుము. ఇప్పుడే వెళ్లుము. [ప్రతాపుఁడు కోపమునలేచి పోవును.]

జగదేవ:—అన్నా! నా విన్నపంబొకటి మన్నించి విందువని వినయవిధేయుండనై వేడికొనియెద. నేను పుత్రహీనుండను. "అపుత్రస్యగతిర్నాస్తి" యను వచనంబు నామానసంబెల్ల కాలంబులం గలంచుచుండును. కావున నీవీసుత్రాణు మన్నించి నాకు వానిని పుత్రభిక్షగనిడితివేని నానింగూడి. సుఖమున నుండెద.

ఉ. సోదరనిన్ను వేఁడెదను సుత్తుని నేఁ గొనిపోయి పుత్రుఁగా
నాదరమొప్పఁ బ్రోవమది నాశజనించెను పుత్రహీను నక్ష
సాదరతన్గ సున్నైనుమ సమ్మతినీసుతుఁ బుత్రభిక్షగా
మోదమొసంగ నాకిడుమ మ్రొక్కెద నీకిదె నన్నుఁ బ్రోవుమా.

[ అనుచు మ్రొక్కును. ]

ఉదయసింగు:—జగదేవా! నీకేల యీ పుత్రేషణ? గర్భమునఁబుట్టి తలిదండ్రులచేఁ బెంపఁబడిన సుతులు హీనమతులయి కృతఘ్నత హెచ్చి తలిదండ్రుల నెదిరించి వారిమానసంబు కలంచుచుందురు. పుత్రహీనులకుఁ బుత్రులు లేమి దుఃఖంబొకటితప్ప మఱియేదియు వారిని బాధింపదు ఇదినిజము. నీవన్నయు నైతింగియు నీపుత్రభ్రాంతి నీకుఁగలదేని యీ దురాత్మకునిఁగొని పోయి రక్షించుకొనుము. ఇప్పుడే నానుండి వానిఁదీసికొనిపొమ్ము. కృతఘ్నుఁడు వీఁడు కావున వీనిముఖావలోకనము నేఁ జేయనోప.

జగదేవ:—[ నమస్కరించి సుత్రాణుబిలిచికొని నిష్క్రమించును. ]

ఉదయసింగు:—ఈ నాపుత్రులు మూర్ఖులయిరి. ఇప్పటిస్థితిలో వీరు నా రాజ్యమేల నర్హులుకారు. నాకు వార్ధకము సంప్రాప్తించెను. ఈ రాజ్యం బెటునిలుచునో తెలియకయున్నది. చింతించి ప్రయోజనంబేమి?

[ నిష్క్రమణము. ]..

## ద్వితీయ రంగము.

### ఉదయపురము - రాజగృహము.

### ఉదయసింగు - శ్యామలాంబ.

(ఉదయసింగు జ్వరాయాసముచే మంచముపై బండియుండును. సమీపమున శ్యామలాంబ కూర్చుని )

శ్యామలాంబ:—దైవమా! నామనోనాయకునీవిధి బాధించిన నాగతియేమి?

ఉ. దైవమ! యీ యధర్మపరుని దార్ఢ్యము తగ్గగ సాగ నింక నే
నెవ్విధి పోర్తు ప్రాణములనీ భువి నిల్పఁగ? దిక్కు లేదు నీ
పావన! ప్రోవవే పతిని నామము నుఁ జేయుచు దీనయైన నన్
గానవె కంఠసూత్రమునుఁ గాచి కృపామతి! మ్రొక్కి వేఁడెదన్.

ఉదయసింగు:— (కన్నులు తెఱచి) ప్రేయసీ! కన్నీరు గార్చెద వేల? ఊఱడిల్లుము. జననమరణాదు లేరికి తప్పినవి కావు. నీవిటు దుఃఖించినఁ బ్రయోజనంబేమి?

శ్యామలాంబ:— నాథా! ముందు నాకెవరు దిక్కు? నేననాథనయ్యెద నేయని చింతించెదు.

చం. నను విడి నీవు పోయినను నాగతి యేమి? యనాథనైన నన్
గని యిటు రమ్మటంచుఁ బలుకంగ క్షితి లేరొకరైన నెట్టులీ
తనయుఁడు జ్ఞాతివర్గమున దక్కునొ జీవితుఁడై! నృపాలకా!
కనికరముం దలంచి యొక కార్యము సేయఁగ నిన్ను వేఁడెదన్.

ప్రాణపతీ! దైవదౌష్ట్యంబున నీవుఁ బరలోకప్రాప్తికలిగెనేని యీ లోకమున నీ ముద్దుల కొమరుని జగ్గమల్లును మాటలాడెడువారెవరు? జ్ఞాతివర్గమున వాఁడెటులు తలయెత్తును? "జ్ఞాతిశ్చేదనలేనకిం" యనెడు నానుడి తప్పగునా? మీ వాక్కు రాజకుమారుఁ డాయుధము నెత్తఁగలఁడా? నాథా! ప్రాణపతీ! మనోనాయకా! దీనురాలి మొఱవిని కరుణంబున నీ రాజ్యమునకుఁ బట్టంబు నా పట్టికిఁ గట్టునట్టు లాజ్ఞయిమ్ము. దీనయై నిను వేఁడెద.

ఉదయసింగు:— శ్యామలా! యూఱడిల్లుము. చింతింపవలదు. నీ కోరిక సఫలముఁ జేయ సర్వప్రయత్నంబు సలిపెద. మన జగ్గమల్లు రాజ్యంబు దక్కించుకొనుట కష్టసాధ్యంబగును. ప్రతాపుఁడు ప్రతిమప్రతాపుఁడు కావున నా యనంతరము వానినెదిరించువారుండరు. అయినను నా సచివవరులనాలోచించి కాఁదగిన కార్యంబు సలుపులకొనరించెద నీవు పొమ్ము.

(నిష్క్రమణము.)

## తృతీయ రంగము.

## ఉదయపురము.

### రామసింగు - లక్ష్మణసింగు.

లక్ష్మణసింగు:— అన్నా! నిన్నరాత్రి వివాదమేరీతిఁ బరిష్కరింపఁబడెను?

రామసింగు:— వివాదాంశము వివాదములోనే నిలిచినది. లోకములో లేని సంగతి జరుగవలెనన్న నెవ్వరొప్పెదరు? జగ్గమల్లుకుఁ బట్టంబుగట్టవలెనని యుదయసింగుగారు తమ మరణసమయంబునఁ బలికిరఁట. అంతమాత్రమున వంశపద్ధతిని ధిక్కరించి మనవారు ప్రతాపుని కాదని జగ్గమల్లునకుఁ బట్టంబుఁగట్ట సమ్మతింతురా?

లక్ష్మణసింగు:—అటులైన జగమల్లునకు తునమట్టిపట్టుకదా?

రామసింగు:—మాటమాత్రమునఁ గార్యము ముగియునా? వాదయినఁ బలివాదలేక యుండునా? తిన్నారుకద మనవారుకొందఱు, లోలోగా జండను బెట్టి కన్నులఁ జూచుచుందువారు. జగ్గమల్లు తల్లిదిక్కువారు కొందఱుపచ్చియున్నవారు. వారిలో మనవారుకొందఱు చేరి వారు. నేఁడు ప్రతాపునకుఁ బట్టంబుగట్టఁబడును. అందఱు రానలయునని ప్రతాపుని పక్షమవలంబించినవారు చాటింప నాజ్ఞయిచ్చినారు. అట్లేరీతిగ జగ్గమల్లుపక్షమంబు జాటింప వారిదిక్కువారాజ్ఞ యిచ్చినారు. ముఖ్యము సంతోష సమయంబునసైతము సంగరంబు సంభవిల్లునని తోఁచెడి.

లక్ష్మణసింగు:—ఎవరేదిక్కుననుండరే ప్రతాపుని రాజ్యము ధీయివాడు కాదు వాఁడెనురుపడి నిలిచి నపుడు వీరానిలుచువారు? సింహమెక్కడ? బక్కనక్కయెక్కడ? ప్రతాపుఁడు రాజయిన క్షత్రియుల పౌరుషముదక్కును. జగమల్లు రాజయిన క్షత్రియులకు నిండ్లు వాకిండ్లు దక్కును.

రామసింగు:—ఎవరికేమిదక్కిననను మనకేమో సేవవృత్తితప్పదుగదా? ఈ యధికప్రసంగములు మనకేల? రామాయస్వస్తి. రావణాయస్వస్తి యని యుండవలె. ఎవరురాజయిన వారినిఁ గొలుతము. నిజమా? కాదా?

లక్ష్మణసింగు:—నిజము. నిజము. ప్రొద్దుపోవుచున్నది. మనమా పనులకుఁ బోవుదముకమ్ము.

(నిష్క్రమణము.)

## తురీయరంగము.

ఉదయపురము - ఆస్థానమంటపము.

ప్రతాపుఁడు-జగమల్లు-పురోహితులు-రామభట్టు-లక్ష్మణభట్టు - కుబేరసేన జయదేవ - భీమజీ- శేషజీ - కృష్ణసింగు - దౌలతుసింగు - సర్దార్‌సింగు. బలవత్‌సింగు - విక్రమసింగు.

[సింహాసనము మధ్యనుంచి కుడిప్రక్కనఁ బ్రతాపుసింగు పక్షమవలంబించినవారును యెడమప్రక్కను జగ్గమల్లుపక్షమవలంబించినవారును గూర్చునియుందురు.]

లక్ష్మణభట్టు:—(లేచి) సభాసదులారా! శుభముహూర్తంబు మీఱుచున్నయది. ఆలస్యమేల? ఉదయ సింగుగారి మరణశాసనము రీతి మనజగ్గమల్లునకుఁ బట్టంబు గట్టుదము. పట్టంబుగట్టి పిమ్మట రాజుగారి శవసంస్కారమునకు మార్గము లేకయుండును.

(జగమల్లునింజూచి)

కం. లెమ్మా జగమలు! తిలకము
గొమ్మా ఫాలమున నుంచికొమ్మా యాసం

దమ్మున సింహాసనమున
రమ్మా యెక్కింతు మనము రంజిల్లంగన్.

జగ్గమల్లు! ఆలస్యమేల? లెమ్ము.

రామభట్టు:—ఏమీ! లక్ష్మణభట్టు! నీ వెవఁడవు. రాజద్రోహివై నేనిచటనుండ నీవా రాజును జేయువాఁడవు? ఔరా! గర్వము; ఈ రాజ్యమునకు జగమల్లెవఁడు? ఘనకము కనకసింహాసనంబు నెక్కఁదగునా? రాజునకుఁ బెద్దకొమారుఁడు వీరవరతాపుఁడై ప్రతాపుఁడుండ, వానిఁ గాదని సింహాసనంబు గొనువారెవరు? సింగము నోటఁబడిన యామిషంబుఁ గరిశాబకంబు కొనఁజాలునా? తరుశాఖలోఁబడి శరణీపాలుఁడు మరణశాసనంబు వ్రాసినమాత్రాన తరణివంశసరణి తప్పఁగునా? ఏలయీ వడమాటలు?

(ప్రతాపునిఁ జూచి) రాజకుమారప్రతాపాగ్రేసరా! క్షత్రియాన్వయప్రదీపా! వీరప్రతాపా! ప్రతాపా! లెమ్మా.

కం. లెమ్మా! ప్రతాప! తిలకము
గొమ్మా ఫాలమున నుంచికొమ్మా! యానం
దమ్మున సింహాసనమున
రమ్మా యెక్కింతు మనము రంజిల్లంగన్.

ప్రతాపా! లెమ్ము. ముహూర్తంబు మీఱును.

దౌలతుసింగు:—(లేచి) ఏమీ! బ్రాహ్మణా! జగమేలఁజాలు జగ్గమల్లు మీవారు రాజ్యమేలఁజాలఁడా? వాఁడు క్షత్రియుఁడు కాఁడా? రాజపుత్రుఁడు కాఁడా? రాజుగారి యనుశాసనంబు దిరస్కరింపఁదగునా? ఇది హితబుద్ధి కాదు. అధికప్రసంగములు మాని మానితముగ జగ్గమల్లునకుఁ బట్టంబు గట్టనిమ్ము.

ప్రతాపసింగు:—(కోపమున లేచి) ఏమీ! క్షత్రియాధమా!

శా. ఏమీ! క్షత్రియ! యేమిమాటలివి? యేకీ కాంతునీ వెట్టు లీ
భూమావాదము? దీర్తువో తెలుపుమా మాన్యుండవై తేని? యీ
నామాన్యాంబును నాకుఁ గాదనుచు భూనాథుఁడు తాఁ బల్కఁగా
నేనానన్ కలవాఁడనే! కరమునన్ నేఁబూననే కత్తియున్.

జగ్గమల్లు (లేచి కోపమున)

శా. వాలున్ బూనిన వాఁడవు నీవొకఁడవా? హహ్హా! యిటుల్ బల్కఁగా
చాలున్ జాలును పోఁచివాక్యముల రాజ్యంబేలఁ గాఁ జాలదే!
మేలా నీబలె క్షత్రియాన్వయమునన్ మేమంతయున్ బుట్టమే?
రాలన్ రువ్వినమాత్ర రాజ్యమెటులన్ రాలున్? పిశాచాయానహా.

భిల్లునాయకుఁడు:— [ లేచి తనవ్రేలును వాలుచే నఱికి రక్తములో నరసు చేయుచుండి ]

కం. మీవార్ రాజ్యంబేలిన
నీవారికి శుభముగలిగె మిక్కుటముగనే
దీవనచే రక్త తిలకం
బావర రక్తంబుఁ గనుము యందము మనోసటిక.

[ అనుచుఁ బ్రతాపుననొసట రక్తతిలకంబునుంచును. ]

కుబేరసేన్:— [ లేచి కిరీటంబుఁ జేతనిడికొని ]

గీ. దీప్తిఁగనె నేవి యాంశిలాదిత్యునంది
బహుళయశమేది యార్జించె గుహునిఁ జెంది
భూపతిత్వంబు నెదికనె బాపునంది
యట్టి మకుటంబు నిదె వందుమా నృపాలా.

[ అనుచు మకుటంబు శిరముపైనిడును. ]

రామభట్టు:—

ఉ. స్వస్తి, సమస్త వైరిజన సాధన యోగ్య కృపాణపాణికిన్.
స్వస్తి, సమస్త దేవగణ సాధన యోగ్య సుకర్మ శాలికిన్,
స్వస్తి, సమస్త భూమిజన సాధన యోగ్య సుమోరు వక్త్రికిన్
స్వస్తి, ప్రతాపభూపతికిఁ బావనమూర్తికి భవ్యకీర్తికిన్.

[ అనుచు నాశీర్వదించి యక్షతలు చల్లును. ]

ప్రతాపుఁడు:— [ లేచి ]

ఉ. సోదరులార! మీరు బలు సొంపువహింపఁగ రాజ్యసంపదల్
సాదరమొప్ప నిచ్చితిరి చాలదు నాకని సత్కృపామతిన్
శేవము చూపఁ జేతలెనిఁ బ్రీతిని నేనొనరించు కర్మలం
బాదరమొప్పఁ దోడ్పడుదురంచు మిముం గమనించ జాలవేడెదన్.

సోదరులారా! క్షత్రియకులాభిమానులారా! వైరికరి పంచాస్యులారా! మీరు ప్రీతిని నొసంగిన రాజ్యమంది యేనుమంతానందుండనైతిని. అయినను నిక్కముగ నొకకాండము నా మానసంబిపుడఁదదు. ఇంతటి సంతోషసమయంబున దుఃఖవార్తలు దెలిపి మీ మానసంబులు కలంచుట నాకు ధర్మంబు గాదు. అయినను నేనొకటి మనంబున నవిస్మరింపరాదు. మన పెద్దలచే నార్జింపఁబడిన చిత్తూరు పట్టణము తురుష్కులపాలయినవార్త వినినట్టి యుత్తమక్షత్రియుఁడెవఁడైనను తన నగరంబు సాధించనంత వఱకు సుఖముగ నిద్రపోఁజాలఁడు. అయ్యో! ఎందఱు క్షత్రియులా పురికై యెన్నిమారులు తమప్రాణములు వైరులకృపాణములకు బలి యిచ్చిరి! ఎందఱు క్షత్రియ స్త్రీమణులా పురికై వహ్నిపాలఁబడి కాలిరి! క్షత్రియదేశాభిమానంబునకై మన పూర్వీకులు తమప్రాణంబులు గోల్పోయిరి? వారి దేహంబున ప్రవహించిన రక్తము మనయందు లేదా? వారికిఁ గలిగిన యభిమానము మాయందు నీరగునా? వారికి-

ప్రతాపసింగు:— సచివవర్యా! రేపటిదినంబుననే, నేనప్పగింతును.

రామభట్టు:— మహాప్రభూ! మీవెంటవేటకు నేనురాఁదలఁచినాఁడ. ఆ తమ్మృగపోతమును మంత్రిగారితో మొనరించుకొనిరాయుఁడి.

ప్రతాపసింగు — (బ్రాహ్మణోత్తమా! నీవనురమ్ము 'సభాసదులంజూచి) సోదరులారా! నాకునై మీరల నినాదు ప్రార్థనవిని, మీమీయిండ్లకుఁబోయి యుంచుకని శ్రమించుకొనుఁడి నేనును బోయెద.

(నిష్క్రమణము.)

## షష్ఠమరంగము.

### ఉదయపురికి చేరినయరణ్యము

ప్రతాపసింగు - సుక్త - రామభట్టు - వేఁటకాండ్రు.

[సుక్త యొకదిక్కునుండియు "ప్రతాపుఁ" డొకదిక్కునుండియు నొకమృగముపై బడఁగొరి వచ్చి యిరువురుదానిపై శరము వేయ నది చచ్చిపడును. వారిరువురు సమీపించి]

సుక్త:— సోదరా! ఈమృగంబు నాచేఁ జంపబడినది కావున దీనినీవంటవలదు. ఇది నాసొమ్ము నీది కాదు.

ప్రతాపుఁడు:— సుక్తా! ఏమిమాటలాడెదవు? దూరమునుండి నేనీమృగమునుగని దానివెంబడించి యీ నాశరమునఁ జంపితి దానిని నీవుగొనుట తగదు. ఇది న్యాయము కాదు.

సుక్త:— ప్రతాపా! నీవేమిమాటలాడెదవు? పొదలలోనొదిగియున్న మృగపోతమును నేఁగని యుంకిలొల్పి లేపి వెంబడించుచుండఁగ యీ నాశరమునఁ జంపినదానిని నీవుగొనుట న్యాయముకాదు. రాజధర్మములు జక్కఁగనడిపెదనని నీవాడినమాట యీరీతిగానా నీవు నడుపుదువు?

ప్రతాపసింగు:— సుక్తా! నీవు మితిమీఱి మాటలాడకుము. అధికప్రసంగివి గాకుము. రాజునగు నేనధర్మంబు సల్పుదునని యెన్నితివా? అధికారము లేదనని తలంచితివా?

సుక్త:— ప్రతాపా! ఎన్ననేల! తలఁపనేల? రాజయినమాత్రాన సహజగుణంబులుపోవునా?

ప్రతాప:— ఔరీ! పొగరుపోతా! హెచ్చరిక. తరతమంబులు తెలిసిపలుకుము. మీఱితివో కత్తి తీసెద నీశిర ముఁదఱిగెద.

సుక్త:— ప్రతాపా! ఎంతటిపోటుమానిసివైతివి? నీశరమునకుఁగలవాఁడి నాశరమునకు లేదా? నీకరము నా కరవాలకు మీఱినదయా?

ప్రతాప:— అటులయిన నిలువుము. నీక్రొవ్వడంచెద.

(అనుచునిరువురుకత్తిచేఁబూని నిలుతురు)

రామభట్టు:— (సరభసముగవచ్చి నడుమనిలిచి) హా హా. వలదు వలదు.

చ. వలదిఁకఁ బోరుచాలు బలవంతులు చేకుఱు సోదరుల్ వృథా
కలహముఁ బెంప రాజ్యమునఁగల్గు నుపద్రవకోటి పెల్లుగా
చలము బలమ్ముఁ జూపఁగను శత్రువులుం గని వైరి? మీకు నీ
కలఁతలు చెల్లునే? యొకమృగంబునకై హితమాలకింపుఁడీ.

ప్రతాపా! సోదరునితో యుద్ధంబు సమ్మతము గాదు (సుక్తునిఁజూచి) సుక్తా! నీకిది సమ్మతమా? హితమా? రాజునుధిక్కరించి పలుకుటధర్మమా? ఇది ద్రోహకర్మ గాదా?

**సుక్త:—** ఓరీ! పిచ్చిబ్రాహ్మణుఁడా! సోదరులస్వాగతంబున నీవు ప్రవేశింపకు. అడ్డము నిలువకు వదలుము.

వానిపాగఁ గరడఁచుఁ బలుకుచు పలుకు.

**ప్రతాపు:—** బ్రాహ్మణోత్తమా! పూజనీయుండవై యీపాపసురుఁ బోతు జోలికేల పోయెదవు? వదలి నీ దారినీవు బొమ్ము.

(అనుచు కాలవాలెత్తుదురు.)

**రామభట్టు:—** రాజోత్తమా! రాజకుమారా! ఈ భ్రాతృయుద్ధంబు నేఁగనులఁ జూడఁజాలను. నను ధిక్కరించి మీరు యుద్ధమాడఁదలంచితిరేని యీనాశవమునకై నిలిచి సంగర మొనర్పుఁడి

(అనుచుఁ బిడివాలు పిడి యొడపై బొడచుకొనును.)

**ప్రతాపు:—** హా హా. బ్రాహ్మణోత్తమా! పలుకు. ఇంతటి హత్య వలదు (అనుచుండ బ్రాహ్మణుఁడు మరలఁ బొడిచికొని క్రిందఁబడును.)

హా హా. పాపము పాపము. బ్రాహ్మణహంతకుండ నైతిని.

(ప్రతాపుని బలము నచ్చి చేరును.)

(సుక్తునింజూచి) ఓరీ పాపాత్మా! ఎంతటి పాతకంబునకు నన్నుఁ గాఁజేసితివి.

ఉ. భూపతినైన నన్నుఁ బరిపూజితుఁ డంచుఁ దలంపకీవు నా
నాపరిభాషణంబు లనునట్లుగ నాడుచు నిట్లుఁ జేసి, యీ
తాపసవర్యు చావునకు దారిఁ జూపితి వక్కటా! మహా
పాపము నీకతంబునను బ్రాప్తించెఁ బ్రోల్వెడలి వెళ్లుమా యిఁకన్.

ఓరీ! సుక్తా! నీవిందుండఁ జనదు. నాపట్టణము వెడలిపొమ్ము. నాపురమునందుండినచో ననేక కలహంబులకుఁ గారణంబగును. దానినుండి రాజ్యమునకు బాధఁ గలుగును. నీ వేకతంబున నైనను నాపురంబుఁ జొరకు. హెచ్చరిక.

**సుక్త:—** ప్రతాపా! భూమిపాలుఁడ నే ననుచు గర్వించి పలుకకుము.

ఉ. మాటలు మార్గణంబులయి మానససీమను గ్రుచ్చుఁగాన నీ
మాటికి మాటికిన్ బుకము మానుచుఁ బొమ్మని పల్కుఁ బోలు నే
నేఁటికి నీకు నాకుఁ గల నెయ్యము లీతెను వైరమైతి నీ
నాటికి మాటలేల యిఁక నాపని నీదును నేఁడు చూచెదన్.

ప్రతాపా! మంచిది. నేఁబురము వెడలి వెళ్లెద. ఈ పురమున నీ వెటులుండెదవో చూచెద. కాలము వచ్చినపుడీ మాటఁ దలంచికొని యేడ్చెదవు.

(అనుచు నిష్క్రమించును.)

**ప్రతాప:—** భటులారా! ఈ శవసంస్కారంబునకుఁ దగిన కర్మమొనరించి మీరు రండు.

(ప్రతాపుఁడు నిష్క్రమించును.)

**భటులు:—** (శవమునెత్తికొనుచుండ బ్రాహ్మణుఁడు లేచి.) ఓరీ! దురాత్మకులారా! నన్నేల యెంటితిరి? సోదరుల పోరుమాన్పుటకై పిడివాలునఁ బట్టి బొడిచికొని యూపిరిబిగఁబట్టికొని పడియుంటిని. అంతయు నేఁ బట్టితినని తెలిసికొనరాదా మీరు? బ్రాహ్మణుఁడు చచ్చునా? రండు [illegible] పోదము.

[నిష్క్రమింతురు.]



# ప్రతాపాగ్బరీయము

చతుర్థాంకము - ప్రథమరంగము.

ఆక్బరునగరు.

నౌరోజాబాజారు - నవరాత్రోత్సవము.

అక్బరుభార్యలు (జోదుబి - చిక్కతాయి) - హిందూరాజుల భార్యలు

(సుందరాంబ - సౌభాగ్యవతి - మంగళాంబ - ప్రతాపవతి.)

(బాజారువీధిలో నాడువారనేకవినోదవస్తువులమ్ముచుందురు

రాజస్త్రీలువానినిం జూచుచునాటపాటలం బ్రొద్దుపుచ్చుచుందురు)

(పిదప సుందరాంబ - ప్రతాపవతి యిరువురుదప్పలోలోగానే వెళ్లిపోదురు.)

సుందరాంబ.—[దూరమున నిలిచి] [స్వగతము] దీనిమగని యభిమానంబుం దెగటార్ప సమయమిది. నేనెన్నినయుపాయంబు సఫలంబయ్యెను. నా చెలులు సౌభాగ్యవతి, మంగళాంబ, జోదుబీ మొదలగువారు నాకనుసన్న నెఱింగి యెవరికిఁ దెలుపక వెళ్లిపోయిరి. ఈ ప్రతాపవతి నా చేతఁ జిక్కెను. హా! హా! నేనక్బరుపాదుషాగారికి లోఁబడి మానము నమ్మి సొమ్ములార్జించితినని నా బావ పృథ్వీరాజు నా మగనిని హేళనముసేయుచున్నవాఁడఁట. మూతిపై మీసలేమాయెనని తిరస్కరించుచున్నవాఁడఁట. ఈనాఁడీ ప్రతాపవతిని పాదుషాగారికిఁ జిక్కులాగొల్పి నా బావ మర్యాదఁదీసెద. అదే కూటివారందఱు మైతిమేనిఁ బరస్పర పరిహాసంబులకు మార్గముండదు. అదియునుఁగాక మీవార్ రాజసుతయను దురభిమానంబీ ప్రతాపవతికి చాలఁగనున్నది. దీనిగర్వంబణఁచవలెను. ప్రతాపవతి నాదిక్కువచ్చుచున్నది. ఊరకయుండెద.

ప్రతాపవతి:—ఏమివదినె. ఊరకనిలిచితివి? వినోదములు చూడకమారాయెనా?

సుందరాంబ:—ఏమివినోదములుపోవే. నా కాళ్లునీయుచున్నయవి. నీకేమియయను దానవు. నూతనవిషయంబనినఁ దనువుమఱుగుదు.

ప్రతాపవతి:—నీ పరిహాసంబునకుఁ గొదవలేదు. మనమంగళాంబ మొదలగువారు కానరారు. ఎచటికి పోయిరి?

**సుందరాంబ:**—ఏమి! అచట లేరా? [అని వెనకి] అయ్యో! ఎంతటిదొంగలేవారు? మాకుఁజెప్పక చేయక వెళ్లిపోయినారు. మోసగత్తెలు.

**ప్రతాపవతి:**—వదినే! ప్రొద్దైనది మనము పోవుదము రమ్ము.

**సుందరాంబ:**—మంచిదమ్మా పోవుదము రమ్మా. ఈ నగరు చక్రబింబమువలె నున్నది. ఏదిక్కునుండి వెలివెడలవలెనో తెలియదు. ఇదియదారి కాఁబోలు. పోయినతూరి నేనిటులనే పోయినది.

[అనుచుఁ నష్టదారినిఁ బిలిచికొనిపోవును.]

(అంగళ్లవారు తమయంగళ్లుమూయుదురు.)

[నిష్క్రమణము.]

ద్వితీయ రంగము.

అగ్రహగృహము.

అక్రూరుఁడు - ప్రతాపవతి - సుందరాంబ.

**సుందరాంబ:**—ప్రతాపవతీ! మేము దారితప్పితిమి కాఁబోలు పాదుషాగారి గృహమిది. ఇటునుండెటు వెడలవలెనో తెలియదు.

**ప్రతాపవతి:**—(భీతినభినయించుచు) వదినే! మనగతి యేమి? ఎవనినైనను దారియడిగి తెలిసికొనుము.

**సుందరాంబ:**—ఇచటనెవరును లేరే! అదిక్కుఁబోయి చూచెద.

(అనుచు నిష్క్రమించును)

(అక్రూరు ప్రవేశము)

(అక్రూరునుఁజూచి) వదినే వదినే [అని యఱచును]

**అక్రూరు:**—సుందరీ!

గీ. వదినె వదినె యనుచు వాచఱచెదవేల?
వదినె యెవరునీకు? వాడయెద్ది?
పురుషుఁడెవ్వఁడునీకు? బువ్వుఁబోణి! నీవేల
కలఁతఁజెంది యిచట నిలిచినావు?

భామా! భీతిపడకుము. నేను పాదుషాను. రాజ్యమేలువాఁడను. నిర్భీతిగనా మాటలకు బదులిడుము.

**ప్రతాపవతి:**—[భీతినభినయించు]

చ. ధరణిప! పృథ్విరాజునకు దారను నే నవరాత్ర సంభ్రమం
బరయఁగ వచ్చి వేడుకల నచ్చెరువందఁగఁ జూచుచుండ, నా

సతిచెలులెల్ల నన్ను విడి చయ్యనవెళ్లిరి వెళ్లుదారినే
నరయకయిందుఁ జేరితిని యక్కట! వెళ్ళెడుదారి యెద్దియో?

అక్బరు:—మదగజయానా! నీవదినె యెవరు?

ప్రతాపవతి:—భూమిపాలా! నావదినె సుందరాంబ. దాసీజనపువారి నెవ్వారినైనఁ బిలిచికొనివచ్చెదనని పోయి రాకనిలిచెను.

అక్బరు:—వారిజాక్షీ! దాసీజనపువారిని పిలిచికొనిరాను నీవదినెపోయెనా? మంచిపనిచేసెను. సారసాననా! నీపేరేమి?

ప్రతాపవతి:—పురుషవర్యా! నాపేరు ప్రతాపవతి.

అక్బరు:—మదవతీ! నీవు ప్రతాపవతివికావుననే ప్రతాపవంతులకుఁ దగినదానవు. యౌవనులకుఁ బ్రతాపవతివి. నిజము. శుభవదనా! సౌందర్యాతిశయంబున నీవు రెండవపద్మినివనియు, నిన్నెంతయుఁ జూడనగునోయని తలఁచుచుంటిని. దైవమాయ దురూహ్యంబు. ఏప్రయత్నములేకనే నాయింట నిన్నుఁ దెచ్చినిలిపెను. మందయానా! ఈరాత్రి నీవిందుండి, మఱునాఁడు ప్రాతఃకాలంబున నీపతిగృహంబుఁ జేరుము. భీతిలవలదు. పాదుషాయింటనుంటివనిన నీపతి నిన్నేమిశిక్షింపఁడు. నీకిచట నేకొదవయు నుండదు.

ప్రతాపవతి:— భూమిపాలా! నేనిందుండి చేయఁదగిన దేమి?

అక్బరు:— ఉడురాజముఖీ! నేనుడువ నేల?

ఉ. ఇంతిరో! యేమిమాటలివి? యేమనియుత్తర మేనొసంగుదున్?
గాంతరో! సర్వము గనుచుఁ గానని రీతి నటించువారి కే
నెంతటివాఁడఁ దెల్పఁగను? హెచ్చగు ప్రౌఢవు నీవెఱుంగవే
కంతునిమర్మ శాస్త్రములు? కామిని! నోటవచింపఁ బోలునే?

మానినీ! ఇవిమానసగ్రాహ్యంబులు. నోటవచింపఁదగినవి కావు.

ప్రతాపవతి:— భూపాలా! ఇపుడుగదా నీమనంబుఁ దెలిసితి.

ఉ. మానవనాథ! నీవిటుల మానుషకృత్యము లాచరింపఁగాఁ
బూనుటధర్మమే? యఖిలభూతలమేలెడు పాదుషాయిటుల్
హీనులభంగి మానినుల యిల్వడిఁ బాపుట పుణ్యకర్మమే?
మానుము యిట్టిచేతలకు మానసమెప్పుడు నిన్ను వేఁడెదన్,

ఉర్వీపాలా! సర్వధర్మశాస్త్రజ్ఞుఁడవు. సర్వమతరక్షకుఁడవు. సర్వదుష్కర్మశిక్షకుఁడవు నీవిటులాచరింపనగునా? ఇదినీకు మేలగునా? వినవారుచింతింపరా? కానివారనరా? ఇఁకముందునీచరిత్రము వ్రాయువారేమనియీదుష్కార్యోదంతము వ్రాయఁగలరు? ఒక పేర్గ

మానినీ! పురుషులు విషయాధీనులు స్త్రీలు విషయాతీతలని తెలియవలెను. ఉభయుల మానసమున
మనసిజుఁడు వసించి బాధించుచుండును. స్త్రీల మానసము వజ్రసమానము కావున మనసిజు
శరములకు భగ్నమైనను తెలియక సహించియుందురు. పురుషుల మానసము అతి కోమలము
గావునఁ దత్శరములకుఁ దాళఁజాలక తరుణుల పాదసేవనమైనఁ జేయ సమకట్టి వారియను
గ్రహపాత్రులగుదురు. వారిజాక్షీ! ఈ మాటలచేఁ బ్రొద్దుఁబుచ్చనేల? రమ్ము. శయ్యా
గృహంబుఁ జేరుదము. నీవేమనినను నిన్ను నే వదల? [ అనుచు మరలసమీపించును. ]

ప్రతాపవతి:—ఛీ. పురుషాధమా! నన్నంటరాకుము. దూరముననుండుము. రాజువని నే మెత్తఁగ మాట
లాడిన నవినీతి సిద్ధింపవు.

చ. అతిబలసంగతిన్ క్షితిని నాజినిఁ గెల్చిన రీతిఁ జూచితే
యతివలఁ గెల్వ? జాలుదు? మహాకృతి యో పురుషాధమా! యిఁకన్
మతిఁ గని మాస్వతన్ మనుమ! మానినులన్ మరియాదఁ జూడుమా!
సతులిల మానభంగమును చావని యెన్నుదురంచు నెన్నుమా!

ఓరీ! మతిహీనా! వలదు. నా సరసకు రాకు నన్నంటకు. కారాని సాహసమునకు నను దింపకు.
నీదాసినీవు బుద్ధిఁ దెచ్చుకొని పొమ్ము. నా హితమ్ము వినుము.

అక్బరు:—మహిళాలలామా! నీ హితము నాకు వలదు.

చం. మహిని జయించు నక్బరు లోకమానిని కోడెననంగ నవ్వరే?
సహజమె చేఁతఁ జిక్కు రుచి సారపదార్థము నుజ్జగింపఁగా?
అహిసమవేణి! చాలునిఁక నంగజకేళికిరమ్ము వైళమే
మహితసుఖమ్ము లందెదము మా! మహిపాలుదయాభిపాత్రవై.

అలసగమనా? ఆలస్యంబుఁ దాళఁజాల. నిన్ను వదల.
( అనుచుఁ జెయిఁగుబట్టును. )

ప్రతాపవతి:—( కొసరి బైచి పిడివాలెత్తిఁ జూచి యక్బరు వెనుకకు జరుగును. )

శా. రావమ్మా! యిటు రమ్ము ముందటికి సీరాజాధిరాజత్వమున్
రావమ్మా! కనిపించి కీర్తిఁ గనుమా! రమ్మా! నినున్ జంపుటల్
నేరమ్మా! యటులేల పోయెదవు? కానీ వచ్చెదన్ నేశ్రీ నీ
బీరమ్మున్ వెలిపుచ్చుమా! కలన నిర్భీతిన్ ననున్ గెల్వుమా!

ధరణీపాలా! దూరముతో యికనేల? సమీపమునకు రమ్ము. నీ కృపాణం బెత్తుము? సంగర
మొనర్తుము? నను నీవు జంపిన నా మానముఁ గాపాడినవాఁడవు నీ తగుదువు. నిన్ను నేఁ
జంపినచో నీయట్టి దురాత్ముకునిఁ బాపి యీ ధారణిఁ గాపాడినదాన నేనగుదును. రెంటను
క్షేమముగలదు. ఆలస్యమేల? రమ్ము. ఆలోచనాపరుఁడవై తివేల? తిచ్చవత నిలిచితివేల?

అక్బరు:—సతీమణీ! నీకు నోడితి [ తలవంచి. ]

చం. సువతిరో! దోర్బలంబున వసుంధర నెల్ల జయించి పాదుషా
పదవిని హెచ్చి సర్వభువిపాలుర నా పదసేవ సుంచితిన్

పుణ్యవతినీ యపూర్వ మహిమంబున గర్హితి నేపునన్ను నె.
మ్మదినిక సుందరమా! సతిసమ్రాజ్ఞ శిరోమణివై సుఖోన్నతిన్.

భామా! ఇంక నేఁ బరస్త్రీముఖంబుఁ జూడను. అయ్యో! నాచరిత్ర కొంతటి కళంకంబుగలిగెనుగాని నీ చరిత్ర కొంతటి ప్రాశస్త్యంబుగలిగెను. సతీమణీ! నీవు సహజపతివ్రతవు. నిన్నుఁ జెనకి నేఁ బాతకినైతిని.

ప్రతాపవతి:—భూమిపాలా! పశ్చాత్తాపంబు మానస పారిశుద్ధ్యమునకుఁ గారణము. కావున నిన్ని పాతకంబంటదు. ధరణీపాలా! నేఁ బోయెదను. నాకు దారిఁజూప నెవనినైనఁ బంపుము.

అక్బరు:—ఏవవేలని? నీపాతివ్రత్యమునకు బంటునై నేనే వచ్చెద.

[ అనుచు దారిఁజూపి నిష్క్రమించును. ]

[ సుందరాంబ ప్రవేశము. ]

సుందరాంబ:—[ ప్రతాపవతింజూచి ] అమ్మా! ఏమనఁగ జేయుదిని? వచ్చినవారి మరలఁగనుట కష్టమైనది. నిన్నువదిలివచ్చి మరల నిన్నువదలినచోటుఁ గనలేనైతిని.

ప్రతాపవతి:—అవునమ్మా! సందులుగొందులు గనుటకష్టము. పాపము నాకొఱకుగాను చాలకష్టపడితివి. వదినే! నీవు మరల నడవఁజాలవు. రాజుగారిగృహంబున రాత్రియుండి ప్రాతఃకాలంబు న నేరమ్మా. నాకేమిభయము లేదు. నేనొంటరిగఁబోయెద.

సుందరాంబ:—రాజుగారియింటిలో నాకేమిపని? నేనునీవెంటవచ్చెద.

[ నిష్క్రమణము. ]

## తృతీయరంగము.

### పాదుషాగారి యాస్థానము.

అక్బరు - రాజామన్ - రైమల్లు - పృథ్వీరాజు - బైరాం - బీరుబల్లు.

అక్బరు:—బైరాంగారూ! ఈ భరతఖండంబునందలి యార్యుల నాచారకృత్యంబు లనేకంబులొనరించుచున్నవారు. అందున ముఖ్యమైనది సజీవ స్త్రీమృతి. దానిని నిలుపుటకు చేయు ప నాజ్ఞ యొసంగినారా?

బైరాం:—మహాప్రభూ! అట్టి క్రూరకృత్యంబునకు సాహాయ్యపడినవారికి మరణదండన యని యాజ్ఞ యిచ్చినాను.

బీరుబల్లు:—ఓహో! అటులనా? భర్తవెంట భార్యయొకతె చచ్చుచుండెను. ఇపుడు తమయాజ్ఞ చొప్పున భర్తవెంట నతనిబంధువర్గము పురోహితులు చావవలసివచ్చెను. బాగుగనున్నది.

అక్బరు:—ఏమి బీర్బల్! అటులమాటలాడెదవు?

బీరుబల్లు:—మహాప్రభూ! మీయాజ్ఞరీతి "సతి" యనునది నిలువదుగాని మిగతవారి చితినిజ చుగుదు.

అక్బరు:—బీర్బల్! సతినిలువదా? నిలువదా? చూచెద ఎటులనిలువదో?

బీరుబల్లు:—మహాప్రభూ! కన్నులుండినవారిం గనుగొనవలసినను. ఇంతకంటెను దాము కులీనయొక యాజ్ఞ యొసఁగియుండిన బాగుగనుండెను.



# ప్రతాపాక్బరీయము.

పంచమాంకము - ప్రథమరంగము.

" హల్దీఘాటు " యుద్ధము.

ప్రతాపుని సేన - అక్బరు సేన.

(ప్రతాపుని సేన కొండలపైనుండి అక్బరు సేనను బాధించుచుండును. అక్బరు సేన దిక్కుకొకరు పరుగిడుదురు. ప్రతాపుని సలీమునుఁబట్టి చంపుచుండ వాని సేన మరల గుంపుగూడి ప్రతాపుని బాధింతురు. ప్రతాపుఁడు చుట్టికొనిన వారినెల్లరిని నోడించి మరల రాజామాన్ మొదలగువారు పైఁబడి రా నిలువలేక పఱుగిడును. ప్రతాపుని సేన దిక్కుకొకరు చెదరుదురు.)

సలీము:—(పడినవాఁడు లేచి) భటులారా! ఆ దురాత్మకుఁడు పఱుగిడెను. వానిప్రాణంబున వదలుట మనకు క్షేమము గాదు. మీరిపుడే వాని వెన్నంటి సజీవునిగఁబట్టి తెచ్చిన ముదమందెదను. అటు సాధ్యము కాదేని వాని నిర్జీవ కళేబరమునైనఁ గొనిరండు. నేఁ గనులారఁజూచి సంతసించెద. వెళ్లుఁడు. వాఁడొంటరిగఁ బఱుగిడుచున్నవాఁడు. వానిగుఱ్ఱము గాయపడినది. మధ్య మార్గమున భూరిప్రవాహంబున్నది కావున వాఁడు మీకు దొరకును. వెళ్లుఁడు.

(భటులైదుగురు చిత్తమనుచుఁ బ్రతాపుని వెన్నంటుదురు. అందఱు వెళ్లిపోదురు.)

సుక్తసింహుఁ:—(స్వగతము) అయ్యో! నా యన్న ప్రతాపుఁడు నాకెంతటి విరోధియైనను మా క్షత్రియాభిమానంబునుబట్టి మీవారు రాజ్యంబును క్షేమంబుగ నేలుచున్నవాఁడు. వాని నాశనము క్షత్రియ నామనాశనము. ఆర్యులమతనాశనము. అకటా! ముందువచ్చు తురుష్కప్రభువులందఱు అక్బరంతటి మంచివారుందురా? నిరంకుశాధికారంబీ తురకలకు నమరెనేని వీరన్యమతము వారికి నిడు సంకటంబులు వచింపనగునా? అయ్యో! దేశక్షేమంబు నేనాలోచింపవలదా? అకటా! వాఁడు నా సోదరుఁడే! మేమిరువురొక తల్లిగర్భంబునఁబుట్టితిమే? చతుష్పాదజంతువులకునైన మంతఃకరణంబు మెండుగనుండుననిన నాకునుండదా? ఆలస్యము చేయు సమయము కాదు. ఇపుడే వాయువేగమునఁబోయి వెన్నంటిన భటులను జంపి నాయన్నను రక్షించెద. అటు చేయనేని నా బ్రతుకు వ్యర్థమగును.

(అనుచుఁ బ్రతాపుని వెన్నంటిన భటులను జిక్కినవారినిఁ జిక్కినటులఁజంపి ప్రతాపుని వెన్నంటి తాఁబోవును.)

(నిష్క్రమము.)

శక్త:— హా. క్షత్రియవంశమా! సోదర. నామనసువిచారంబంతయుంతయనినుడువఁగల.

శా. అన్నా! యేమని తెల్పువాఁడనకటా! యానాఁడు కోపంబునన్
నన్నీవాడిన మాటకున్నినిసి నేనిందుండి వేఁబోయి యె
న్నెన్నోపన్నములంది వేలుగతిలే క్లేశంబులన్ గొల్చితిన్
వన్నెన్యాసియుఁ బొని యుగ్రజునిపై వైరంబు సాధించితిన్.

అన్నా! ఈ నాశరీరము నీభారము. నాబుద్ధి నీస్వత్వము. నేను క్షత్రియ కులంబునఁ బుట్టి చెడినవాఁడను కాను. నా ప్రాణంబు నీకృపాణమ్మునకు బలియిమ్ము. అయ్యో! చిన్నతనంబున గర్వించి నీతో వాదాడిన కోపమ్మున నిన్నేటులయినఁ జంపఁ బగఁబూని యాపాదుషాను చేరితి. చేరుటయుచాలక వానికొలువుననిలిచితి. వానిపక్షమేసాంటి కిప్రాణమున వదలనని వాగ్దానమిచ్చితి. అంతటితోఁ బనినిలువక నీపైయుద్ధమొనర్చ వానిఁ బురిఁగొల్పితి. ఇంతయొనరించితినిగాని యుద్ధమున నీవు పడుబాధలను జూచి యిపుడేమియుఁబోవమో నామానసము ఛెంపఁబాలనిదాయె. అప్పుడుమన మాతృగర్భరక్త సంబంధబలము జ్ఞాపకమువచ్చెను. కన్నీరుఁగార్చితి. అన్నా అగ్బరునకు వాగ్దానమిచ్చి యిపుడెటు దానిని మరల్పనోపుదు?

ప్రతాపుఁడు:— (ఆలోచించి) సోదరా! హరిశ్చంద్రవంశసంభవులైన మనమనృతమాడనగునా? అనృతమిహమున దుఃఖంబుదెచ్చు. పరసుఖమును దక్కించు. అధమాధముఁడైన నన్నృతంబునాడ నగునా? వలదు. నీవాపాదుషావద్దం జేరి సుఖముననుండుము.

శక్త:— అన్నా! నీహీనస్థితిని జూచిననాకిఁక సుఖమెచ్చటినుండ వచ్చును? అయ్యో! ఏమియుఁదోఁపదే? అన్నా! నావదినెయెచ్చటయున్నది? పిల్లవాండ్లెచటయున్నవారు?

ప్రతాప:— తమ్ముఁడా! వారందఱుఁ గోమల్ మియరులోనున్నవారు!

శక్త:— అన్నా! చెడితిమి. పాదుషాబలంబులోఁ జాతుర్భాగంబుఁగొని రాజామాన్ కోమల్ మియరును వశపఱచుకొనుటకై పోయినాడు. చాతుర్భాగబలంబుఁగొని మహబత్ ఖాను ‹‹ ఉదయపురి ›› పట్టనుపోయినాడు. కావున అన్నా! నీకిపుడెందును క్షేమములేదు. నీవు నాగుఱ్ఱమును బుచ్చుకొని వాయువేగమనోవేగమునఁబోయి మనవారినందఱిని నచటినుండి పిలిచికొని ‹‹ ఆరవల్లి ›› కొండలలోనుండు భిల్లునాయకుల పల్లెలు చేర్పుము. కాదేని యన్నిటఁ జెడుదువు. రాజామాన్ నీపైనగ్గ్రక్కుచున్నవాఁడు.

ప్రతాప:— శక్తా! ఇట్టిదురవస్థలోనాపాలిదైవమీవని నేఁదలఁచెద. తమ్ముఁడా! నీయట్టియాపద్బాంధవుని తమ్ముని నేనెటుమరవఁగలను. అయ్యో! శక్తా? నిన్నువదలి నేనెటుపోఁగలను?

(ఒకరొకరుకౌఁగలించుకొందురు).

శక్త:— అన్నా? ఆలస్యంబునకుఁగాలంబు లేదు. నీవు వెళ్లుము.

ప్రతాప:— తమ్ముఁడా? మఱియొకటినిను వేఁడెద.

శక్త:— అన్నా? అదియేమి?

ప్రతాప:— తమ్ముఁడా!

కం. మావారి కైన నెన్నఁడును
నీపాలును నెత్తు నసుటసిక్కం బనుచున్
నీవిపుడు మాటయిచ్చిన
దైవముపై భారమిడుచుఁ బరలెదఁ బురికిన్.

సుక్తా! మాటయిచ్చెదవుగదా?

సుక్తా:— అన్నా! మాటయిచ్చితి. వెడలుము. దైవవశమున మరలనీకుబలంబుఁగూడునంతవఱకుఁ గొండ సీమలుదప్ప మఱియెచటను నీవుయుద్ధప్రయత్నంబుసేయకుము. దైవమునీకుసేమమొసంగుఁగాత.

ప్రతాపః— తమ్ముఁడా! పోయివచ్చెద. ప్రాణంబునున్న మరల నీముఖంబుఁజూచెద. (అనుచుఁగన్నీరుఁగార్చును.) సుక్త పోయివచ్చెద.

(ఇరువురు జూమరలించుచు నిష్క్రమింతురు.)

తృతీయరంగము.

అరణ్యము.

ప్రతాపుఁడు - గోరాంబ - ఉమ్రూ - జగత్సింగు - సంగ్రామసింగు - రణసింగు
భ్రమరాంబ - ఆసాధు - (భిల్లునాయకుఁడు.)

ప్రతాపుఁడు - పంల్లాము - కోడలు - పిల్లలు - కొన్నిమూటలు మోసికొని పిల్లలనెత్తుకొని శ్రమపడుచు నడుచుచుండును.

ప్రతాపుఁడు:— [భిల్లనాయకునిఁజూచి] భిల్లనాయకా! మనమునిలుచుటకు సమీపమందెచటను పల్లెలు లేవా?

భిల్లు:— మహాప్రభూ! ఇఁక రెండు గడియలు మనమిటులనే నడచినయెడల భిల్లులగుడిసెలు నాలుగుగల పల్లెయొకటి యున్నది.

రణసింగః— [ప్రతాపునిఁజూచి.]

సీ. నాయనా! యీద్రోవ నడువఁగఁజాల
నాయడుగుల రక్తము వెడలెఁగనుమ

సంగ్రా:— తడిలేదునోట నేఁదడయఁగఁజాలను
దాహమయ్యెడు నీరుదారిఁగాన

జగత్:— ఊరున్నదిచట నే యూరకయుండుమా
యనినీవుబల్కిన ప్రొద్దుమీఱె

ఉమ్రా:— బడలికబలమాయె నడవిలోఁబడియిఁక
నోడలెటునిలుపుదమో పుడమితండ్రి

భిల్లనా:— అమ్మా! కట్టెలకేమికొదవ? ఇవలు వేయుచున్నవి. చెకుముకిరాయితో నగ్గిఁజేసెదఁ (అనుచుఁ ధనసంచిలోనుండి రాయితీసికొట్టి యగ్గిచేసియిచ్చును.)

గౌరాంబ:— (మఱుఁగునఁబోయి రొట్టెలుతట్టి కోడలినిఁజూచి) భ్రమరాంబా! ఈ రొట్టెలతట్టు చూచుచుండుము. భిల్లునాయకుని బిలిచికొనిపోయి త్రాగను నీరుదెచ్చెద.

భ్రమరాంబ:— అత్తా! అట్లనేఁజేసెద.

(గౌరాంబ కడవనెత్తికొని నీటికిఁబోవును.)

(ప్రతాపుఁడు పిల్లలు నేలపైఁబండుకొని నిద్రపోవుచుందురు)

(భ్రమరాంబ యలసటచేఁ గూర్చుని నిద్రపోవుచుండగ నడవి పిల్లివచ్చి రొట్టెలెత్తుకొని పోవును. దానిచప్పుడువిని భ్రమరాంబ పిల్లిరొట్టెలెత్తుకొని పోవునే అయ్యోయని యఱచును. ప్రతాపుడు పిల్లలు లేతురు. గౌరాంబనీరెత్తికొనివచ్చును.)

భ్రమరాంబ:— అత్తా! పాడుపిల్లి యెచటనుండియోవచ్చి రొట్టెలెత్తుకొనిపోయెను. తునుకలుకొన్ని యచటనచటఁబడినవి. (అనుచు రొట్టెతునుకలు నేఱి తనయత్తచేతికిచ్చును.)

రణసింగు:— [పరుగిడివచ్చి]

కం. అమ్మా! యాఁకలిఁగాలను
నమ్మా నాకన్న మిడుము రక్షింపుము వై
శమ్మున నేనిను వేఁడెద
సొమ్మసిలెదవేల మిటులఁజూపుమ కనులన్.

సంగ్రామసింగు:— అమ్మా!

కం. ఈతతిఁ దాళఁగఁజాలనె
యోతల్లీ! రొట్టెతునుక యివ్వవె నాకున్
(అనుచుఁజేతులు సాచును)

జగత్సింగు:— ప్రీతిని నాకది యివ్వవె
మాతా! నినువేఁడువాఁడు మనుపవె నన్నున్.

(అనుచుఁదల్లిని చేయిపట్టుకొనును).

గౌరాంబ:— అయ్యో! తనయులారా! ఇంచుకసేపాఁగుఁడు. ఈతునుకలు నమలినీరుఁద్రావుఁడు మరలరొట్టెలు చేసియిచ్చెద.

(పిల్లవాండ్లు "నాకు మొదటయివ్వు" "నాకు మొదటయివ్వు" అని కేకలు వేయుచు బాధింతురు. దానింగని )

ప్రతాపుఁడు:—హా హా. కష్టము కష్టము ఓర్వఁజాలఁ అయ్యో, దురదృష్టమా అయ్యో!

మ. అకటా! రాజులజన్మమీ యవనిలో వ్యర్థంబు నిక్కంబుగా
సుకరంబై తమసన్నిధానమున వస్తుస్తోమముల్ పేరఁగా
సకలైశ్వర్యసమేతులై వెలయుచున్ సౌఖ్యాంబుధిన్ దేలుచున్
వికటీభూత విపద్దశాధికత భావింపంగలేరెత్తఱిన్.

హా. ఈ బాలురకష్టంబులఁ జూచి నే నోర్వఁజాల. క్షత్రియకులాభిమానమున నార్యధర్మంబు నిలుప సర్వప్రయత్నంబులు సలిపితి. రాజ్యమును గోల్పోయితి. జననదేశంబు వదలితి. ప్రాణంబులైనఁ ద్యజింప యత్నించితి. ఎన్నికష్టములు నాకు నొక్కుమ్మడి సంప్రాప్తించినను నా ధైర్యంబించుకైనను జలింపదాయె. అయ్యో! ఇప్పుడీ బాలురు భిక్షగాండ్రవలెఁ గూటికై పడుశ్రమను జూచి నా ధైర్యంబు నీరైపోయెను. ఇఁక నా యభిమానంబు వ్యర్థము. క్షత్రియులందఱుఁ బారసీకులను జేరియుండ నేనొక్కఁడ నేమి సేయఁగలను? పలుకీపిచ్చి దురభిమానము. ఇపుడేమి సేసిన మేలుగనుండునో తోఁపకయున్నది. (ఆలోచించి) ఏమి! సామోపాయము రాజధర్మము గాదా? వైరులచేయిమీదయినపుడు తగ్గి నడుచుటలోపమా? పుత్రరక్షణ పితృధర్మంబు గాదా? [ఆలోచించి] అవును. సంధికి నుత్తరంబు వ్రాయవలెను. వ్రాసెద.

(అనుచుం దన సంచినుండి కాయిదము - కలము - మసిసీసమును - తీసి వ్రాయ నారంభించి ముగించి చదువును.)

కం. శ్రీమంతా సకల గుణధామా
క్షేమ[illegible] సముద్ర[illegible]ధిప! నీ
సేమమును మదిని గోరుచు
నేనుంటా! వ్రాసినాఁడ దీనిని నీకున్.

అయ్యో! మానవాధిపుఁడు మానవధర్మంబు, నవనిం గాపాడవలెననియును, తద్ధర్మవిరుద్ధంబు సంప్రవర్తించిన పార్థివుఁడు పాపకూపంబునఁ బడుననియును విధియుండిన కారణంబునఁ దద్విధివిరుద్ధంబు సలుపఁజాలక యార్యావర్తంబున నార్యధర్మంబు భద్రముగ స్థాపింప నే సర్వప్రయత్నంబులొనరించిన విషయము తమకు విశదముగా నుండును. తత్ప్రయత్నంబున విఫలమనోరథుఁడనైతినను విషయము సైతము తమకుఁ దెలిసియుండును. క్షత్రియాభిమానంబు క్షత్రియకులమునకు నెల్ల సముద్భవించి యుండినచో, భరతఖండంబున నన్యమతంబు తలఁజూపనట్టులొనరింపఁగల శక్తి నాయందుండెనని వ్రాయుట యాత్మస్తుతిగఁ బరిణమించును గావున నా విషయంబిందు వదలికొనియెద. నామట్టుకు నేనొక్కఁడనైనను భూభుజధర్మంబవలంబించి దూరదేశంబుఁ జేరి కాలంబు గడప యత్నించితినిగాని బహుపుత్రవంతుడగు నాకది యసాధ్యంబయ్యెడి. ఎందుబోయినను నందు మీ బలంబు గాచియున్నది. ఇఁక నరణ్యసంచారంబున నుండమన్ననో పసిపిల్లలకాయలవాట లేదు. వారీదినంబున నాకన్నులెదుటఁబడినకష్టం

బునుఁజూచి యింతటినికృష్టదశ రాజాధిరాజను వాకొదవె నేయనిచింతించి బాలుల పురోభి వృద్ధినాలోచించి యన్యమతావలంబకులైనను మీరు కరుణాశీలురని యెంచి యీయుత్తరంబు వ్రాసితిని. ఎంతటివిపదబ్ధినిమునింగి నాయంతటివాఁడీ దుఃఖోదంతంబు తనవైరికి వ్రాయ నను కష్టమో తామే యెఱుంగఁదగినది. ఇంతగ వ్రాయఁబడిన దానిముఖ్యోద్దేశమేమనిన తమరు కృపాశీలురై మీవారి రాజ్యము తమకులోఁబడిన రాజ్యమని తలఁచి యింకనన్నే విధమున బాధింపక నామానసమునకింకనెట్టి సంకటంబులు దెచ్చిపెట్టక తమయుత్తమగుణము లోకప్రసిద్ధి చేయుదురని కోరు మిత్రుఁడు.

ప్రతాపభూపాలుఁడు.

( కాగితము చదివి మడిచి భిల్లునాయకునిఁజూచి )

భిల్లునాయకా! యీ జాబుఁగొని ఢిల్లీపాదుషాగారికి నందించిరమ్ము. నేనిచటనే నీవు వచ్చునంతవఱకు నుండెద. కొన్నిదినంబులిందుండి వెడలఁజాలను.

భిల్లునాయక:—చిత్తము ( జాబుఁగొని నిష్క్రమించును. )

ప్రతాపుఁడు:—హా. ప్రతాపుని జన్మమేమువ్యర్థము. వ్యర్థము. అయ్యో! ఈ ప్రతాపనామంబు నాకు నిరర్థకము. అహహా! పిల్లలసంకటముఁజూచి ధరింపఁజాలక శరణోऽహమని, తనజన్మస్వామికి మొఱలిడినవాఁడు భూభుజజన్మంబెత్తినగునా? తనబిడ్డలఁ జక్కఁగఁ గాపాడ నేరని దుర్బలుఁడు భూపాలనామార్హుఁడా? హా. హా. పరిభవదూషితమగు నీ శరీరము నుండనేమి? ఆ పాదుషాయొకవేళ ననుమన్నించి రాజ్యంబిచ్చెనుపో నేనేమని యీ రాజ్యమేలుదు? సరివారిలో మరియాదగల మానిసినని నేనేమని ముఖమెత్తికొని బ్రదుకుదు? హా. దైవమా! నన్నింతటి దుర్దశకు గురిచేసి కన్నులారఁజూచెదవా? ఏమి సేయుదు. క్షత్రియపౌరుషంబు నా తాత సింగరాజుతో నంత్యమయ్యెను. అయ్యో! ఆ సింగరాజునకు నేఁబుట్టక దుర్బలుఁడగు నుదయసింగు గర్భమునఁ బుట్టితినిగదా? యుద్ధమున మేనుఁబాయక తీపని ప్రాణమును నిలిపితినిగదా? హా. హా.

సీ. మహనీయసత్త్వుని గుహ్యుని నామంబును
నేఁబుట్టికూల్చితి నిక్కమకట
రణభీముఁడగు బాపురాజు యశంబును
నేఁబుట్టికూల్చితి నిక్కమకట
అప్పహామహుఁడగు సమరశీకీర్తి
నేఁబుట్టికూల్చితి నిక్కమకట
సంగరభీకరు సింగరాజుని పేరు
నేఁబుట్టికూల్చితి నిక్కమకట

గీ. కులముపెంచువారు కొందఱు ధరలోన
కులముదెంచువారు కొందఱయ్యో

ఏండ్లుపూండ్లనుండి యీకులమి నార్జించిన
కీర్తిసమయుఁగొట్టి కీడు వడితి.

ఇఁక నే నేమనికొనిన నేమిప్రయోజనము? ఎంతచింతించిన నేమిప్రయోజనము? అయ్యో! నా కాగిదమా పాదుషాసభలోఁ జదివినపుడు నా వైరులెంత సంతసించెదరో? ఆ పాపాత్ముఁడు రాజామాన్ తాసనినంతటిపని యొనరించితి నేయని యెంతగర్వించునో? ఆ ప్రతాపుని గర్వమడఁగెనని జోదుపురాధిపుఁడెంత హర్షించునో? నా బావమఱది పృథ్వీరాజు నాకైగా నెంతచింతించునో? నా చెల్లెలు ప్రతాపవతి నా హీనస్థితినివిని యెంతదుఃఖించునో? ఏమిసేయుదును? యత్నమిమీకౌను? ( గౌరాంబనుఁజూచి ) ప్రేయసీ! ఇఁకఁగొన్ని దినంబులు నేనిచట నేయుండి పల్లెలోనివసించి ముందు ప్రాణముననుంటినేనిఁ గర్తవ్యంబు నిర్ధరించెద.

గౌరాంబ:—ప్రాణపతీ! ధైర్యమువదలకు.

గీ. బహుళదినములఁ గళలేని బాధఁజెందు
కమలవైరినిఁ గానమే కాంతమనము?
మరలఁగళలన్ని సమకూరి మానితముగ
జగతి నేలఁడె యారాజు సంతసముగ.

ప్రాణకాంతా! తగ్గుమగ్గులేరికిని సహజము. కావున చింతింపవలదు.

ప్రతాపుఁడు:—కాంతా! నీ తియ్యనిమాటల సంతసించితి. విధివిపర్యయమయినపుడు మనముచేయునదేమి? ఇఁకఁగాలంబుగడుపనేల? సమీపముననుండు భిల్లులపల్లె వైపుకేగి చేరుదుము; రణజిత్తును నీ వెత్తికొమ్ము. నేనీమూటలు మోసికొనివచ్చెద.

గౌరాంబ:—అటులనే కానిమ్ము. ( అనుచుఁ పిల్లవానినెత్తికొనును )

ప్రతాపుఁడు:—( మూటలుమోసికొని )

కం. ధవళచ్ఛత్రము నీడను
నవమణి మకుటంబువలన నమరఁబడిన భూ
ధవుశిరమున నిలిచెనె యీ
తవుడుమూఁటగలమూట? యకట! దైవవిచేష్టల్.

( నిష్క్రమము. )



# ప్రతాపాగ్బరీయము.

షష్ఠమాంకము - ప్రథమరంగము.

అక్బరుపాదుషా యాస్థానము.

అక్బరు - ఖాన్‌ఖానా - రాజామాన్ - మహ్దాదేవ - పృథ్వీరాజు - భిల్లునాయకుఁడు.

**అక్బరు:**—మిత్రులారా! సేనాధిపతులారా!

చం. పటుబలశాలురిండఱును బోరెదువాని నా ప్రతాపసిం
గుటిలునిఁబట్టి నాపురికిఁ గూల్పఁగఁ జేయక వచ్చినారు మీ
మ్మటు నడువిక్రమాఢ్యులని యెన్నుదు నేను మనంబునందు సం
కటమిది యొక్కరాజు ననుఁ గాదని ధిక్కృతిఁ జేసెనన్నచో.

సేనానులారా! మీరు యుద్ధమునఁ బ్రతాపునిఁ గెలిచితిమని యెన్ని పౌరుషములు పలికినను నాకవిసంతసంబులుగాకయున్నవి. మీరందిన జయము నాకపజయముగాని జయముగాదు. రాజ్యధనంబులులేవని నేనేనాఁడుచింతింపను. మమునెల్లర నెల్లకాలంబు తిరస్కరించి దూషించు దుర్గర్విని నా పాదసేవకునిఁ జేయనైతినేయని దుఃఖించెద. రెండులక్షల సేనతోఁ గూడిపదివేలభటులతో మీరువారి జయించినదొకజయమని నేఁ దలంతునా? మా బలమును ధిక్కరించి సేనలోదూఱి నాకుమారుఁడగు సలీముసరసంజేరి యేనుఁగపైనున్నవానిఁ గదియ నుఱ్ఱమెగరించి వానినిఁ జంపఁజూచిన యా ప్రతాపుని పరాక్రమము మనమెంతనుతించినను తక్కువయని నేనెంతు. హా. హా. ఆనాఁడు మన "సలీము" ఉక్కుకవచంబు దొడిగియుండఁడేని యింతవఱకుఁ బ్రాణంబుననుంట, సందియంబుగనుండినదఁట. అట్టివైరి గాయముల బాధకు తాళఁజాలక బవరంబువిడి పరుగిడినపుడు వెంటనంటిపట్టక వానినిఁ బ్రాణంబున వదలివచ్చిన మీ పౌరుషము నేనెంతనిదూషింతు. సేనానులారా! మీ రెటులయినను వానినిఁ బట్టితేకున్న నా మనంబునకు సంతసంబుగలుగదు.

**పృథ్వీరాజు:**—(లేచి) భూమిపాలా!

గీ. ఆప్రభాకరుఁ బట్టఁగనగునె మీకు?
ఆప్రదీపమునంటఁగనగునె మనకు?
ఆప్రతాపునిఁ బట్టఁగనగునె? యేల
ఆప్రయత్నంబు వలదిఁక నవనిపాల.

**రాజామాన్:**—(లేచి) ఏమీ! పృథ్వీరాజా! వానినిఁబట్టుట సూర్యునిఁబట్టునంతటి కష్టతమమా? బావ యని యభిమానమున మాటలాడెదవు కాఁబోలు? ఆలనాఁడు మనసుగా మనకస్త్రో

హితమై చిక్కినప్రతాపునివదలెనని వింటిని. నేనేవానిని వెంబడించియుండిన వానింబట్టి రెట్టలుగట్టికొని యీడ్చికొనివచ్చి పాదుషాగారి పాదములపైఁబెట్టక యుందునా?

అక్బరు:—నిజముబావా! నిజమాడితివి. వానిఁబట్టుట యసాధ్యమని నేనెన్నటికిఁ దలపను.

పృథ్వీరాజు:—మహీపాలా! అంతటిచులకనగఁ బ్రతాపునివిషయము మాటలాడఁదగదు. వాఁడుసామాన్యుఁడుగాఁడు. అన్యునకునందునఁ బరమతావలంబకునకు వాఁడెన్నఁడు లోఁబడువాఁడుకాఁడు.

అక్బరు:—పృథ్వీరాజా! నీ వభిమానబలంబున నిటులాడెదవు. ఆ ప్రతాపుఁడు మానవుఁడేగదా? మానవమాత్రుఁడు నాకులొగ్గఁజేసిన నగునా?

పృథ్వీరాజు:—మహీపాలా!

ఉ. పలుకకుఁ బల్కుమారిడినఁ బాదుషగారి మనంబునొచ్చునం
చులికెడఁగాని కానిదెడ నూరకయుందునె? యాప్రతాపుఁడా
కలుషవిదారి యారిపుని కాయములాంతకుఁడా నృపాలకుం
డలసిన నాజినోడినను నాపదఁజిక్కిన నన్నుఁగొల్చునే?

అక్బరు:—పృథ్వీరాజా! నీ యభిమానంబు నీవువానవుగదా? ఆ నీ బావను దైవమనినీవు పూజించెదవు కాఁబోలు? నీ యభిమానంబుదించెద. వానినిఁబట్టి నాసేవకునిగ నాకొల్వుననుంచెదఁ జూచెదవా?

పృథ్వీరాజు:—మహీపాలా! అదినీవశముగాదు.

చం. వెఱవక బల్కువాఁడ మదివేఱువలంపకు భూమిపాల! యే
యఱుముఱలేదు క్షత్రియకులాభరణుండగు నాప్రతాపుఁడిం
పఱిపరుఁగొల్వఁ బూనెననఁ బారవె శైలములస్థిరంబులై
కరకుఁదనంబె యుగ్గుగను గాంచినవాఁడెటు నేర్చుదీనతన్.

భూపాలా! ఆ ప్రతాపునిమహిమ మీరెఱుఁగరు. వాఁడవవింబడి ప్రాణంబులనైనఁ ద్యజించును. మీకెన్నఁడును విధేయుఁడుకాఁడు.

( భిల్లునాయకుని ప్రవేశము. )

భిల్లునా:—తైమూరువంశాభరణా! అక్బరుపాదుషా; వందనంబులు?

అక్బరు:—భిల్లనాయకా! నీవచ్చినకారణంబేమి?

భిల్లునా:—మహాప్రభూ! మా ప్రతాపమహీరాజీజాబు మీకందించుమనటుల యాజ్ఞాపించినాఁడు.

అక్బరు:—ప్రతాపరాజా? మాపేరిట జాబువ్రాసినాఁడా? ఏదియాజాబు?

భిల్లునా:—మహాప్రభూ! ( ఇదియ అనుచు జాబందించును. )

అక్బరు:—( జాబునంది రాజామానునుఁజూచి ) బావా! ఈ జాబుఁజదువుము.

రాజామాన్:—[ జాబంది ] చదువును.

[ వెనుకటిరంగములో వ్రాయఁబడిన జాబుచదివి. ]

ఆ ప్రతాపుని పొగరిపుడుగదా యణఁగెను. వానిగర్వమునకుఁదగిన శాస్తియాయెను. ఇక వాఁడు జీవచ్ఛవుఁడై బ్రదుకును.

పృథ్వీరాజు:—[ లేచి ] ఏమీ! రాజామాన్! ఏమిమాటలాడెదవు?

కం. ఆ జగమేలఁ గఁజాలిన
రాజిలుసమ్మతిని వైరిరాజును గొలుచున్
రాజామాన్! సీవిటులన్
రోఁజుచుఁ బ్రల్లదములాడ రోఁతయుఁగాదే?

నీవిటుపలుకకుము.

అక్బరు:—పృథ్వీరాజా! ఇఁక నీప్రల్లదంబులు ముగింపుము.

చం. చదువుమ కాయిదంబిదిగో! చాలిఁక నే వినఁజాల నీదుప్ర
ల్లదములు పాదుషాబలము లక్ష్యముపెట్టక నిల్వనేర్చునే
కుదురుఁగ క్షాత్రవాళిధరఁ? గూటికిలేక ప్రతాపుఁడుగతిన్
బదిలమటంచు నాయెడగుఁ బట్టుఁగవేఁడెను దైన్యవృత్తిచే.

పృథ్వీరాజు:—మహిపాలా! భరతఖండమునందలి యితరమహీపాలురనేకులు నీకొలువునకు లొగ్గుదురు గాని ప్రతాపుఁడు లొగ్గుననిన నెవరునమ్ముదురు? క్షత్రియకులాలవాలమైన మీవార్ రాజ్యమును, క్షత్రియకులాభరణుఁడగు వీరప్రతాపుఁడు ప్రతాపుఁడు నీవశపడుచి నీకు లొగ్గియుండునా? అటులైనఁ బ్రపంచమునిలుచునా?

చం. పవనమువీచునే? కుదుటఁబర్వత పాళియునిల్వనేర్చునే?
భువియెడుగంటదే? జలధిభూతల మెల్లనుముంచి పారదే?
దివి రవికాంతి చెడ్వడదె? దీప్తియెడంగదె జ్వాలమాలికిన్!
తివిరిప్రతాప భూవిభుఁడు దీనతఁగుందుచు నీకు లొగ్గినన్.

భూపాలా! ఆ కాగితము నేనమ్మను.

అక్బరు:—ఏమీ! ఆ కాగితము సృష్టింపఁబడినదియా?

పృథ్వీరా:—సందేహము లేదు.

అక్బరు:—ఎవరిచే సృష్టింపఁబడినది?

పృథ్వీరాజు:—మీవద్దనుండు స్తుతిపాఠకులచే

అక్బరు:—[ భిల్లునాయకునిఁజూచి ] ఓరీ! భిల్లునాయకా! ఈ జాబెవరిచే వ్రాయఁబడినది? ఎవరు నీచేతికి దానినిచ్చిరి?

భిల్లనా:—మహాప్రభూ! ప్రతాపమహీపాలుఁడా జాబు నాకనిచ్చెను.

అక్బరు:—పృథ్వీరాజా! వింటివే భిల్లునాయకుని మాటలు.

పృథ్వీరాజు:—కాగితము కల్పించ నేర్చినవారు భిల్లులవానికిఁ గల్లలాడ నేర్పరా?

అక్బరు:—పృథ్వీరాజా! నీ బావమఱఁదిఁ గాపాడఁదలంచి నీ వెంత ముప్పునకుఁ బట్టుపట్టినావు. మంచిది. నీ బావకు నీవే కాగితము వ్రాసి యీ జాబుద్వారా నిజస్థితిని దెలిసికొనుము. అంతట జాబు వానికి నేను బదులు వ్రాయుదు.

పృథ్వీరాజు:—భూపాలా! నేనిచ్చిన సేనటులాచరించెద. పోయివచ్చెద.

అక్బరు:—భిల్లనాయకా! నీవు పృథ్వీరాజు సహనమునకు బొమ్ము. అతఁడు మీరాజునకొక జాబిచ్చును. దానికి నీవు బదులు దెచ్చియిమ్ము. పొమ్ము.

[ నిష్క్రమణము. ]

ద్వితీయ రంగము.

ఢిల్లీ నగరము.

పృథ్వీరాజు - ప్రతాపవతి - భిల్లనాయక.

[ పృథ్వీరాజు చింతించుచుఁ గూర్చునియుండఁ బ్రతాపవతి ప్రవేశించును. ]

ప్రతాపవతి:—ప్రాణనాథా! ఏమిది? చింతించుచుఁ గూర్చుంటిరి? నేఁడక్బరుపాదుషాగారి సభలో నెవరయిన నీ మానసమునొప్పించు మాటలాడిరా?

పృథ్వీరాజు:—ప్రేయసీ! నేనేమని వివరించి తెలుపఁగలను? వీరాధివీరులగు క్షత్రియకులము నాశనమగు సమయము తటస్థించెను.

చం. కువలయనేత్రి! బాహుజులకుఁ జలనంపులు సంభవించె నీ
భువి లయమయ్యె నేఁడిటికి యీ భూభుజవంశము; నీదుసోదరుం
డవమతియంచు మానసమునందుఁ దలంపక వ్రాసెఁ బాదుషా
యవనిపుఁ బ్రాపుఁగోరి యకటా! యిఁక నేమని నీకుఁ దెల్పుదున్.

ప్రాణసతీ! నేను పాదుషాసరస క్షత్రియుల ప్రతాపమహిమం బవుడవుడు గొప్పదియొనర్చి వర్ణించుచు క్షత్రియకులాభరణుండు ప్రతాపుడు వానిని లోఁగొన నసాధ్యంబని నుతించుచుంటిని. ఆ నా మాటలచే నెత్తిపొడుచుచు నేఁడు సభలోఁ బాదుషాగారు నన్నుఁ బరిపరివిధంబులఁ బరిభవింపఁజూచిరి. అయినను నేనువారికిలొంగక ప్రతాపునిచే నాజాబు వ్రాయఁబడలేదని వాదించితి. అందులకుఁ బాదుషాగారు మానసంబు నఁగిలిసి ప్రతాపునకు వ్రాసి దాని యథార్థంబు నానోట నుడువవలెనని యాజ్ఞాపించినారు. ఆ ప్రతాపునినుండి వచ్చిన యీ భిల్లునాయకుని నావెంటఁ బంపినారు.

ప్రతాపవతి:—[ భిల్లునాయకునిఁ జూచి ] భిల్లునాయకా! నీవు మాయన్నగారివద్దనుండి వచ్చితివిగదా?

భిల్లు:— అవునమ్మా! అటనుండి వచ్చితిని.

ప్రతాపవతి:— అయ్యా! మాయన్నయుచటనున్నవాఁడు, బాగుగనున్నవాఁడా? మా వదినెయుఁ బిల్లలు క్షేమముగనున్నవారా?

భిల్లు:— అమ్మా! అరణ్యవాసులకు క్షేమమెచ్చటిది?

ప్రతాపవతి:— అయ్యా! ఏమియిటులవలికెదవు? వారందఱుఁ బ్రాణంబులనున్నవారు కదా?

భిల్లు:— అమ్మా! ప్రాణంబుల నుండినను లేనివారింబలెనున్నవారు.

ప్రతాపవతి:— అదియెటులు? వివరించి తెలుపుము.

భిల్లు:— అమ్మా! నేనేమని తెలుపుదు? పిల్లలఁగూడి యరణ్యసంచారంబొనరింపుచుఁ గొండగుహలలో డాఁగుచు నిలిచినచోట నిలువక ప్రతిక్షణము తన్నుఁబట్టువారెటువత్తురో యని కలుచక్కులు జూచుచు వెళ్లుచుఁ గూడుఁగానక నిలువనీడలేక, పరుండఁ బల్లపులేక పిల్లలనెత్తికొని మూటలు మోసికొని తిరుగుచున్నవారు. అయ్యో? ఒకదినమంతయుఁ బిల్లలకన్నములేకపోవుట బాధింపుచుండ మహరాణిగారడవిగడ్డిగింజలపిండిచే రొట్టెలు గాల్చి నీరుదెచ్చి పిల్లలకివ్వఁదలంచియుండ నెక్కడినుండియో యొకయడవిపిల్లివచ్చి యారొట్టెల నెత్తికొనిపోయెను. దానినిఁగని పిల్లవాఁడేడ్వసాగిరి.

ప్రతాపవతి:— అక్కటా! అయ్యో! ఇంతకష్టమా! హా! దైవమా

సీ. శ్రీమంతుఁడై పుట్టిచెలువొందు నాయన్న
నిలుపేదయై నిల్చె నేయటవిని
రాజాధిరాజుగ రాణించు నగ్రజుఁ
డక్కటా నీరకొనుండయ్యె నేఁడు
ఇల్లాలు గుణవతి పిల్లలతల్లినా
వదినెకుసయ్యెనే వసతి యటవి
ఆహారమమరక యుపవాసముల చేయు
గతివచ్చెనే రాజసుతుల కిపుడు

గీ. ఆహాహా! దైవమ! యింతటి యకటవికట
ములనువారికి నీవిటు సలుపనగునె?
వారునిన్నాడి నిందించు వైరులైరె!
పాడుకాలము ప్రాప్తిల్లెబ్రాహ్మణులకు.

(భిల్లునాయకునిఁజూచి) భిల్లునాయకా! అటుపిమ్మటయేమాయెను?

భిల్లునాయ:— అమ్మా! ఆపిల్లల బాధయుఁదల్లిసంకటముఁ జూచియోర్వఁజాలక మాప్రభువు పాదుషాగారికి జాబువ్రాసెను.

ప్రతాపవతి:— అయ్యో! ఎంతబాధపడి యెంతచింతించి యెంతగఁబ్రాణంబుపైన వచ్చినాయన్న

స్వాతంత్ర్యమునా? ప్రతాపుఁడుతన రాజ్యధనమునంతయుఁ గోల్పోయినను క్షత్రియాధరముఁ జై కసమానధనంబుఁ గాపాడికొన్నాఁడను ప్రసిద్ధిలోక మెల్లవ్యాపించినది. దానికిపుడు కుందు కలుగ నేర్చునే? దురాశాపిశాచంబు క్షత్రియాధములనుబట్టి పాదుషాగారి నౌరోజా సంతకు ఈడ్చుచున్నయది. ఈక్షిసేది? హమ్మీరవంశజుఁడగు ప్రతాపుఁడు మాత్రమా యవమానము నుండి తప్పించుకొన్నాఁడు. పాదుషాగారిని నెదరించునంతటి సాహాయ్యము ప్రతాపునకు నెచ టనుండివచ్చినదని ప్రపంచమే ప్రశ్నించుచున్నయది. ఆప్రశ్నకునుత్తరంబు ప్రతాపుని పౌరు షమొకటియనియును ప్రతాపునిచేతికృపాణధారమణి యొకటియనియును నేఁ బలుకుచున్న వాఁడను. ఒకానొక కాలమునందైననీ "నౌరోజా" సంతనేర్పఱచిన పాదుషా బంధింపఁ బడును. ప్రాణము శాశ్వతము కాదుగావున నతఁడెపుడో పడిపోవును. అపుడుగదా క్షత్రియు లరదఱు క్షత్రియాభిమానబీజంబు రాజస్థానక్షేత్రంబున స్థాపింతుమని ప్రార్థింతురు. క్షత్రియపౌరుషాభిమాననైర్మల్యము ప్రతాపుఁడా మగలరాజస్థానమునఁ బ్రజ్వలించుచుండును.

కం. శత్రుంజయుఁడవు నీవయ
క్షత్రియవంశాభిమాన గర్వం బెపుడున్
ధాత్రిని బ్రోచెడి మనమును
పత్రికఁ గుండ్లోసంగుఁ గాంచి పార్థివ నీయెడన్.

ఇటుల విన్నవించు, « పృథ్వీరాజు

(ప్రతాపవతి సొమ్ములమూటతోఁ బ్రవేశించి.)

పృథ్వీరాజు:—ప్రేయసీ! కాగితము ముగించితిని.

ప్రతాపవతి:—ప్రాణపతీ! జాబుచదివెదవా? నేనువినియెదను.

పృథ్వీరాజు:—చదివెదను. (అనుచుఁ మూత్రిగఁజదివి.) ప్రేయసీ! ఈ క్రిందనే నీ యన్నకు నీవింపుక రేమయినను వ్రాయుదువు?

ప్రతాపవతి:—వ్రాసెదను. (జాబుదీసికొని వ్రాతముగించి) నాథా! నే వ్రాసినది చదివెదను వినుము.

కం. సోదర! నతులిడి వ్రాయు స
హోదరి విన్నపము వినుము యుక్తమటన్నన్
పాదుష బారికిఁ బడనటు
నీదారిని జూచికొనుము నిజమిది కనుమా!

అన్నా! నీ చావశే వ్రాయఁబడినదంతయు నిజమని నాయభిప్రాయంబు. నౌరోజాసంతలో క్షత్రియస్త్రీలమానంబు నేఁ గాపాడినవిషయంబు లోకవిదితంబు. ఇపుడు క్షత్రియకుల పౌరుషాభిమానంబు గాపాడునది నీభారము. రాజ్యంబుఁ గోల్పోయి నిలువీడనై, పిల్లపాపలం గూడి ఘోరారణ్యంబుల సంచరించుచు, ఘోరబాధలనొందుచున్న కారణంబున నీ ధైర్య సాహసము తరిగిపోయెనని నేఁ దలంపఁజాల. కాదేని మేవార్ రాజ్యమునందుఁ బుట్టిన నీ సోదరి పాదుషానెదిరించి క్షత్రియస్త్రీల మానముఁ గాపాడెగద, మేవార్ రాజ్యంబునఁ బుట్టి

వంశము మాత్రము గాపాడికొనుము. శైవమువంటి పాలిటి రెయికళలిచ్చిం గాదనినను మంటిరెయికళలి రాకనిలుచునా? మనకు మాత్రము శాశ్వతముగ బహుళకుశమేయుండునా? శుక్లపక్షము రాదా?

[ భిల్లునాయకుని ప్రవేశము. ]

భిల్లునాయక:— మహాప్రభూ! వందనంబులిడెద.

ప్రతాపుఁడు:—భిల్లునాయకా! నా జాబుఁ బాదుషాగారికి నిచ్చితివియా? వారు దానికేమి బదులిడిరి?

భిల్లు:—మహాప్రభూ! జాబిచ్చితిని; సభలోనది చదువంబడెను. పాదుషాగారికి మీ బావగారికిని గొప్ప వాదముజరిగెను. మీ బావగారును మీ సోదరియును నాకొసగిన యీ సొమ్ములతో నీకందించు నటుల తెలిపినారు. ఇదిగో జాబు ఇదిగో సొమ్ములమూట.

[ జాబునుమూటయు నిచ్చును. ]

ప్రతాపుఁడు:—( జాబునందు చదివికొని చింతించుచు )

ఉ. అక్కట! బాపురాజకుల మాఁడిపాలయ్యె నాదుపుట్టుకన్
నిక్కము క్షత్రియాన్వయము నీఱయె నాజననంబుచేనయో
ప్రుక్కిన నేఁడు ధైర్యమును జూపకవైరిని నస్యువేఁడితిన్
రక్కొనెనింద నేనుభువిరాజుగఁబుట్టిన కారణంబునన్.

( అనుచు దుఃఖించుచుఁ గూర్చుండును. )

గౌరాంబ:— ప్రాణేశా! అంతటిదుఃఖకరమైనవార్త నాయన్నయేమివ్రాసినాడు? నీచెల్లెలేమివ్రాసినది?

ప్రతాపుఁడు:—భామా! నానోటనేఁ బలుకఁజాలను. ఇదిగో యీజాబు. నీవేచదివికొనుము.

గౌరాంబ:—( జాబుంది చదివికొని యాలోచించి )

ప్రాణనాథా! ఈ జాబునందు నీకు నుత్సాహకరమైనవార్తయున్నది. దుఃఖమునకేమియుఁ గారణంబులేదు.

ప్రతాపుఁడు:— ప్రేయసీ! రణమునఁనోడి, యటవిఁజిక్కి ధైర్యమువీడి ప్రతాపుఁడు తురుష్కప్రభుపు శరణముజొచ్చెనునిందపై బ్రదికినంతకాలము నా శరీరచ్ఛాయఁబోలె నను వెన్నాడును గదా? అయ్యో! నా బావ వృథ్వీరాజెంతనొచ్చికొని యింతటి హితమువ్రాసెనో? అయ్యో! నా చెల్లెలికిఁగల మనోదార్ఢ్యంబు నాకులేదాయెఁగా?

గౌరాంబ:— ప్రాణపతీ! గతమునకు వెతఁజెంద నేల? ఊఱడిల్లుము. మనకు శుభకాలంబువచ్చునని మదినమ్మినాను. కష్టవార్ధిలోఁబడి గట్టుఁగానక యీది తనకలాడుమనకు నాయన్న ధనము తెప్పఁబంపినాడు. దానినిఁబుచ్చికొనుము.

ప్రతాపుఁడు:—( నిట్టూర్పునిడుచు ) ప్రేయసీ! దానికేనంటను. ఆడుదానిభాగ్యమున నేఁబొట్ట పోసికొనఁదలంతునా? అన్నయై చెల్లెలికి సకలాభరణములిచ్చుటమాని, మానితుని చెల్లెలిసొమ్ములుగొని యన్న జీవింపనగునా?

ఉ. బావయు నాదుసోదరియు భావమునం గడుకుంది మూకమై
యీవిధి భూషణంబులను నిచ్చిరి కూటికి సక్కటా! భువిన్
లేవడియైయె మనోజనము లేమలకల్గినసంది యెవ్వఁడీ
జీవము నిల్పఁగోరు? నివి చేతుల నంపఁగ నేర మానినీ!

ప్రేయసీ! ఆఁడుదాని నగలుగాని బ్రదుకుదుమా? నా స్థితి యింతకుదిగెనా?

( కుబేరసేన్ భిల్లులు ప్రవేశించి )

భిల్లునాయకుఁడు:—మంత్రివరా! ఇదిగో యితఁడే మనరాజు.

కుబేరసేన్:—( వ్యసనమభినయించి దూరమునుండి )

మ. అవురా! ప్రాకృతకర్మ మెంతఘనమో! యయ్యారె! నాభూధవుం
డవునో కాదో యెఱుంగరాదితఁడహో! యాధైర్య మాశౌర్యమా
జవసత్వంబెటుపోయె? వాఁడె నటవీసంచారమున్ గల్గె హా
భువిలోనన్ దురదృష్టమింతయగునే? భూతాత్మ ప్రాల్గవ్వనే?

అయ్యో! ఎంతటియున్నతస్థితి నున్నవాఁడెంతటి హీనస్థితికిదిగెను? ( అనుచు నమీపించి చింతచేఁ దలవంచికొనికూర్చున్న ప్రతాపునింజూచి )

కం: లెమ్మా ప్రతాప! నీస్థై
ర్యమ్మును విక్రమము వైరిరాజులపై వై
రమ్మునఁజూపుమ యీవ్యస
నమ్మునకిది యదనుకాదు నమ్ముము భూపా!

( అనుచుఁ గేలిడిలేపఁ బ్రతాపుఁడులేచి కన్నీరుఁగార్చి కౌఁగిలించును )

ప్రతాపా! ఏమివెసనమిది? ఏందుకుఁగాను చింతించెదవు?

( ప్రతాపుఁడు మాటలువెళ్లక యూరకయుండును. )

భూపాలా! మాటాడవేల? ఆ తురుష్కుల నెన్నిమారులో రణమునఁ బ్రాణములఁ బాపిన నీవెటులోడితివి? నీకింతటియవస్థ యెటుసంభవించెను?

ప్రతాపుఁడు:—మంత్రివరా! దుఃఖవార్త నేనేమని తెలుపుదు? జయముమనదయ్యెనని యుప్పొంగి రిపుసేనలోఁజొచ్చి సలీమును జంపఁబ్రయత్నించి నా సుత్రాణము వానియేనుఁగపైనెగరించి వానిఁబొడిచితి. వానిభాగ్యవశంబున నాపోటు వానికవచమునందవలి యంబారిలో వాఁడు సొమ్మసిల్లిపడెను. అంతలో సైన్యమునుండియో కాజామాన్ సుక్తా మొదలగువారు వచ్చి ననుఁజుట్టికొని బాధించిరి. నా శరీరమునుండి గాయములచే రక్తము ప్రవహింపసాగెను. తాళఁజాలక యలసిన గుఱ్ఱమయినను నెవటను నిలువక రిపుకోటినిదాఁటి పఱగిడితి. ననుఁబట్టుకొన రిపులు వెంబడించిరి. మనసుక్తా వారిని వెంబడించి మార్గమున వారినిఁజంపి ననురక్షించి పిలుపొపలనుఖలిచికొని యచటికిఁజేరుమని యుపదేశించి తనగుఱ్ఱమిచ్చెను.

సిరిగాంచు శ్రేయముల్ సుఖముల్ జెందుము క్షత్రియవంశనామమిం
ధరను చిరంబుగా నిలిపి ధర్మముగా మనుమెమ్మ భూపతీ.

భూపాలా! ధనమునకుంగాను నీవుచింతిలవలదు. ధనము సర్వకార్యసాధనము కావున తద్ధన సాహాయ్యమున నీవుసేనఁజేర్చి తురుష్కులపైయుద్ధమొనర్చి నీ రాజ్యము సాధించికొనుము.

భిల్లనాయకుఁడు:—భూవల్లభా!

కం. భిల్లులము సేవకులమై
యెల్లెడ సెత్తఱిని నిన్ను నేమఱకను భూ
వల్లభ నీకడ నుండెద
మల్లలు గావయ్య నమ్మి కలనికిలెమ్మా.

భూపాలా! నీ సేవకులు పదివేలుగురు భిల్లులు నీ రాకకై కాచియున్నారు. వారంద రొక్కుమ్మడి పోరుసలుపఁగూడిన భిల్లులమంతయుఁ గూడుదును. ఆ పదివేలతోడన మన చెదరినసేన యంతయుఁ జేరును. ప్రారంభమున గొండవీములలోనుండు కోమలుమియ్యాడును సాధించి పిదప "ఉదయపురి" పై దండెత్తుదము.

ప్రతాపుఁడు:—భిల్లనాయకులారా! మీరు నాకాపద్బాంధవులు. మీ హితంబవశ్యమనుసరించెద. యుద్ధమునకు వెళ్లునపుడీ పిల్లపాపలనెచట భద్రముగనుంచుదును?

భిల్లనాయ:—భూపాలా! నా పల్లెలో నా యింటనుంచెద. నా తల్లిని నా చిన్నతమ్ములను గాపాడినటులే వారినిరక్షింప వాగ్దానమొసంగెద.

ప్రతాపుఁడు:—కుబేరసేనా!

కం. నీయుపకారము మఱతునె
కాయమునఁ గుబేరసేన? కలిమినిడుచు నా
శ్రేయముఁ జూడఁగఁ బూనితి
వోయనఘమతీ! నుతింప నొప్పదె నాకున్.

సచివవర్యా! ముఖస్తుతియగునని వెఱచి నినుఁబొగడుటమానెద. తండ్రీ! అనుజ్ఞయిడితివేని యుద్ధమునకు వెడలెద.

కుబేరసేన:—భూపాలా! నీకు శుభమగుఁగాత. ఈ భిల్లులను గొందఱిని నా వెంటఁబిలిచికొనిపోయి ధనము పంపెద.

(భిల్లులు కుబేరసేన నిష్క్రమింతురు.)

ప్రతాపు:—[గౌరాంబనుఁజూచి] ప్రేయసీ! కుబేరసేనుని సాహాయ్యమున యుద్ధమునకు సకలసాధనములు నాకు సమకూరినవి. కావున నీకసేవాలస్యంబు సేయక వెళ్ల వలయును. నీవు నీ పిల్లలం గూడి యీ భిల్లనాయకుని పల్లెలో నుండుము. బ్రతికియుంటినేని సేవింతు మరలఁజూచెద.
[కన్నీరుఁగార్చుచు]

సీ. ఘోరమున జయమొంది పురముం జేరితి నేని
భామినిన్గనఁజాలు భాగ్యమొదవు.
తుమలనోడించి భోరను నేనైనఁబో
పొలుక యువరాజపదవి నీది
(అనుచు ఉత్తముని కౌఁగిలించుకొనును.)
సంగరంబున రిపుసంఘ మోర్చితి నేని
సంగ్రామజిత్ నీకు సౌఖ్యమొదవు
(సంగ్రామజిత్తును కౌఁగలించుకొనును.)
పగరనోర్చితి నేని జగతీసింగా నీకు
జగమేలు సౌభాగ్యమగును నిజము
(జగతీసింగును కౌఁగలించికొను)

గీ. రాణమీఱఁగ నేను పటాణిసేన
నోర్వఁగలనేని సామ్రాజ్య మొదవు నీకు
నో రిరణజిత్తు! బాలకా! యొదిగి యొదిగి
యుండు నీతల్లి చెంత మేలొప్ప నిపుడు.
(అనుచు రణజిత్తును ఎత్తికొని ముద్దిడిదించును.)

గౌరాంబ:— అద్యపుత్రా! నీకు జయము గుఁగాక. నను మఱవకు. శీఘ్రకాలంబునఁ బునర్దర్శనంబిత్తువని నే నినుఁ వేఁడెద.

ప్రతాపుఁడు:— ప్రేయసీ! నీవు వీరమాతవుగావున పొచ్చసుదువఁజాల. పోయిరమ్ము.

(గౌరాంబ పిల్లలు నిష్క్రమింతురు.)

(భిల్లులవేషులు ప్రవేశింతురు.)

భిల్లనాయకుఁడు:— భూమిపాలా! తమ మంత్రికుఱ్ఱేర నేనుఁడీ ధనమిచ్చిపంపినాఁడు. మరల్కగావలసినంత ధనము సిద్ధపఱచియుంచెదనని పలికి క్షత్రియులందఱు నినుఁగూడు లాగున బోధించె దనని చెప్పినాఁడు.

ప్రతాపుఁడు:— భిల్లనాయకులారా! మీరీసమయంబున నాకొనర్చు సాహాయ్యప్రోత్సాహంబు లపరిమితంబులని నే నెన్నితి. నాకింతటి యుత్సాహంబు మీరు గలిగించునది చూడ దైవబలంబు నాకిప్పుడు సంపూర్ణంబుగఁ గలిగినదని నే నిర్ధరించుట కేసందియమును లేదు. ఈదినంబున నే రాత్రికోమల్ మీరు మఱుఁ జేరి గాఢాంధకారంబునఁ గోటయెక్కి రిపుకోటిని గీటడంచి యిప్పాత్ర వెలివడకముస్నే యుదయ పురముఁ జేరి పురమును ముట్టడించి పాదుషా బలంబు పనపోయంబుగ నాపురిఁ జేరనటులొనర్చి కానిఁబట్టుదము. మరల యుద్ధమునకుఁ బాదుషాకాంతసేనకైనఁ బంపనీండా. ఇది మీకుసమ్మతము గదా?

భిల్లనాయక:-- ప్రతాపమహీపాలా! మీ మూలపురుషుఁడగు గుహుని బాల్యమునుండియు పెద్దలు పెంచి పెద్దఁజేసి "యీమూకు" రాజ్యాభిషిక్తుఁ జేసిరి. నాటినుండి మీ యింటియుప్పుఁదిని మీచే సకలసన్మానంబులందినాము కావున మిమ్మెప్పుడు నెడఁబాయము. ఇది ప్రమాణము సేయుటకై నిచ్చఁ జేరితిమి. మా జననపురి యుదయపురి. కావున మేమచ్చటనుండునది, కాదేని చచ్చునది యీరెంటిలో నొకటి నిజముగ నిర్ధరించికొనినాము. మాకు వేషణములవలదు. ఆహారధాన్యములవలదు. అడవి మృగములే మాకాహారము గాను. అవి దొరకకపోని నడవిలో నుండు వృక్షఫలములు చాలును. అవియు దొరకకపోని గడ్డిగింజలు మెక్కియుందుము. రణమునఁ జచ్చుదాక చేతిని రాణించు నీ ప్రాణంబు విడుము.

(అనుచు నందఱుఁ గత్తులు ఝళిపించి నొసటఁ జరులుదురు)

ప్రతాప:--- భిల్లనాయకులారా! సంతసించితి. మాండవ్యమతమనుసరించి మనోజయమిపుడు కలిగినది. కావున రణమునకు వెళ్లుదము రండి.

(భిల్లులు జయ్ జయ్ అనుచు)

[నిష్క్రమణము.]

చతుర్థరంగము

ఉదయపురము

ప్రతాపుఁడు - భిల్లులు - ప్రతాపుని సేన.

ప్రతాపుఁడు:— [ఉదయపురసమీపమున సేనలు మొనఁదీర్చి] సేనానులారా! భిల్లనాయకులారా! మనదేశము మనరాజ్యము మన పురి పరులఁగనుఁగొను భాగ్యము మనకుఁ గలిగెను. అయ్యో! నాకీరాజ్యముపై నభిమానమెంతయో మనరాజ్యమంటిని. పొరబడితిని. సేనానులారా! మన దేశమను కాలము పోయెను. తురకలదేశమను కాలము వచ్చెను. మన రాజ్యమెన్నడో పోయెను. తురకలరాజ్యమాయెను; మనపురి కాదిది. తురకలనగరు. అకటకటా!

సీ. పౌరుషంబున కెల్ల పౌరస్త్యమైయుంచు
మనవారి దేశంబు మమతఁ గనుఁడి
సాహసంబునకెందు సామ్యమై వెలసిన
మనవారి రాజ్యంబు మమతఁ గనుఁడి
స్థైర్యలక్ష్మికిని నాధారమై పేరొందు
మనవారి తానంబు మమతఁ గనుఁడి

క్షాత్రసారంబయి ధాత్రికెక్కినఁగన్న
మనవారిరాష్ట్రంబు మమతఁగనుఁడి

గీ. మనము పుట్టినపురి యిది మమతఁగనుఁడి
మనము పెరిగిన తలమిది మమతఁగనుఁడి
మనముకట్టినచెరువిది మమతఁగనుఁడి
మనము తనివోవ దీనినిఁగనిన మీఁద.

భ్రాతృవరులారా! ఇట్టిమనపురికి మనము వెలియైతిమి. అయ్యో! మనపెద్దలిందుండి తమ పుత్ర పౌత్రాదిసంతతికి సుఖాలవాలమగునట్టి గొప్పగొప్ప మందిరంబులు కట్టించిరి. బావులు త్రవ్వించిరి. ఉదయసాగరము చెఱువును ద్వాదశవర్షంబులుగట్టిరి. మానము రక్షించిరి. పరసుఖమునకై పరమాత్ముని యాలయంబులేర్పఱచిరి. మననేమమునకై వారొనరించినదంతయు మనమీతురుష్కులకు ధారవోసితిమి. మనమూదూరమైతిమి.

సీ. మనకునై మనపెద్దలను వొందఁగట్టిన
మేడలుతురకల వీడులయ్యె
ఆర్యుల దేవాలయంబులు యవనుల
ప్రార్థనగృహములై పరిఢవిల్లె
ఆగమోక్తవిధానమమరియర్చనలందు
మనవిగ్రహంబులు మన్నుఁగలిసె
లోకైకలింగము మాయేకలింగము
రుబ్బుగుండయ్యెఁ దురుష్కతతికి

గీ. మనజననభూమి యరులకు మాన్యమయ్యె
మనవారువులన్ని రిపులకు మనుకులయ్యె
మనుజతమమునుగన్న యవనిగూన మాధవములు
పాదుతురకల పాలాటఁజూడఁగలమె!

సోదరులారా! మనపెద్దలచే పాలింపఁబడిన యీపురినిఁ బాయుటమన ప్రాణములు బాయుట కదా? మున్నేకచక్రపురజనులు బకాసురునిచే బాధింపఁబడియుఁగూడ నోర్చిరిగాని జననభూమి వదలిరే కదా? దేశమెంతవిశాలమైనను, నితరదేశములందెంతటిసుఖముండినను, మానవుఁడు తాఁబుట్టినగృహమున నెంతకష్టముండినను దాని మాననేర్చునే? జననపురాభిమానపాశంబు మానవుని నెంతదూరమునుండియైన నీడ్చి తనసన్నిధికిఁ దెచ్చికొనునుగదా? అట్టియభిమానంబు లేనివాఁ డొకమానవుఁడని యెంచనగునా? చతుర్విధాభిమానంబు లుత్తమపురుష భూషణంబులు. స్వాభిమానంబు మొదటిది. ఇందు పరాభిమానంబు చేరును. స్వగృహాభిమానంబు రెండవది. స్వనగరాభిమానంబు మూడవది. స్వరాష్ట్రాభిమానంబు నాల్గవది. ఈయభిమాన చతుష్టయములేనివాఁడు మానవగణములోఁ జేరినవాఁడు కాఁడు. ఈయభిమానంబు మన ధైర్యశౌర్య సాహసంబులకు నేఁడు ప్రోత్సాహకసాధనమైయుండుఁ బురికొల్పెడుఁ గావున మనమిప్పుడు ప్రాణంబును నరకుసేయక యీమనపురము సాధింప సాహసింపవలెను. ప్రాణంబునిలిచి జయము మనదయ్యెనేని మనమందిరములలో మున్నుబలెనె పైఁజేయిడికొని సుఖముగ నిద్రింపవచ్చును. అటుకాదేని యీతుచ్ఛశరీరమాహవార్థమునకై దానమొసఁగి సూక్ష్మశరీరమంది స్వర్గసుఖంబుఁ బడయవచ్చును. జయమిహసుఖమిచ్చును. చావుస్వర్గసుఖమిచ్చు. ఇవిరెంటినివదలి ప్రాణంబు తీపని, రణము వదలితిమేని శాశ్వతనరకంబు మనకు దప్పదు. మునుసృష్ట్యాదిని భుజబలసాహసమున భూమినేలవలెననికదా బ్రహ్మభూభుజులను సృష్టించెను. అట్టిక్షత్రియధర్మంబు మానఁదగునే? మానినచో మనము కులహీనులము గామా? భ్రాతృవరులారా! నిజముగ క్షత్రియబీజ సముద్భవులను మనమని స్థాపింప నేఁడుగదా సమయము తటస్థించె. ప్రాణమో మరణమో మనకు నేఁడు గదా యేర్పడును? ఇహలోకమో పరలోకమో మనకు నేఁడుగదా లభించు. హా! దైవమా! మీవీరక్షత్రియుఁడు పిఱికియై యపనిందరానీయక పోషించుభారము నీయది. క్షత్రియసోదరులారా! భిల్లనాయకులారా! అలనాఁడు గుహుని వెంచి యరినాశనంబొనరించి యీమాయనఁబట్టము గట్టి మునుమీముత్తాతలసాహసంబు నిజమని నేఁడుగదా మీరు స్థాపింపవలెను.

భిల్లనాయకుఁడు:— ప్రతాపమహీపాలా! ఈ దినంబున "ఉదయపురీ రాజసింహాసనంబున" నినునిలుపమేని మేము తద్వంశజులము గామని నమ్ముము. ఆలస్యంబేల? ఆజ్ఞయిమ్ము.

చం. ధరణిపలగ్గ కెక్కుఁడుమె? దారియొనర్తుమె కోటగోడలో?
సరవిని ద్వారముల్విఱిచి చయ్యనలోపల దూఱఁజూతుమే!

తురకమూకల దుష్కర్ములను దుత్తుమురుగ సేతుం జేతుమో! దేవా

నరవర యాజ్ఞయిమ్ము రిపునాశన కారివిగమ్ము యమ్మహీశ.

ప్రతాపుడు:— భిల్లనాయకులారా! లగ్గలెక్కి కోటను సాధించుట మీ సాయవసాహసంబులకుం దగిన మార్గంబని నేనెన్నెద.

భిల్లనాయకులు:— మే మటులనే యొనర్తుము.

[ అనుచు నొకరిపై నొకరెక్కి పగ్గము పైకి వేసి తత్ప్రసనంబున నంతలు గోటయెక్కి దుముకుదురు. లోంగా కలకలధ్వనులగును. కోటవాకిలి తెఱవంబడును. అందఱు లోంబ్రవేశింతురు. యుద్ధము జరుగును. తురకలు దిక్కు కొకరు పరుగిడుదురు. ]

[ నిష్క్రమణము. ]

## పంచమరంగము.

ప్రతాపుని మరల రాజుగా చేయుదురు.

సమాప్తము.